# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 16
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 16
18-4-1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి


ముఖ్యమంత్రికి ముఖ్యమంత్రి

# చంద్రబాబునాయుడు ఎందుకు వస్తున్నట్లు?

మా రాజకీయ పరిశీలకుడు

చంద్రబాబు అంటే చిన్నవారుకాదు; కేవలం ఒకపార్టీ కార్యదర్శి కాదు; ముఖ్యమంత్రికి ముఖ్యమంత్రి. అటువంటి శ్రీ ఎన్.చంద్రబాబునాయుడు 23తేది నెల్లూరుకు విజయంచేస్తున్నారట,మండలస్థాయి పార్టీ నిర్మాణ పర్యవేక్షణే ఆయన రాక పుద్దేశ్యమట.

బాబుగారిదెబ్బ జిల్లా తెలుగుదేశం నాయకులు నిప్పులుచెరిగే ఈ ఎండలో మెట్టతాలూకాలలోకూడా పర్యటిస్తున్నారట. ప్రతి మండలకేంద్రంలో పచ్చ జండా నాటి పార్టీ కార్యాలయం ప్రారంభించామనిపిస్తున్నారట.ప్రస్తుతం ఉదయగిరి ప్రాంతంలో నలుగురు ఎం.ఎల్.ఏ.లు తిరుగుతున్నారట; అయ్యో పాపం అనిపిస్తున్నది!

తెలుగుదేశానికి శిక్షణ శిబిరాలు, రహస్య సమావేశాలు ఎక్కువగా వుంటున్నాయి. ఆ శిబిరాల్లో ఇవ్వబడుతున్న శిక్షణ ఏమిటి? ఆ సమావేశాల్లో చెవిలో వూదబడుతున్న రహస్యమేమిటి? మనకు తెలియదనుకోండి. బయట కర్ణాకర్ణిగా వినబడుతున్నదానినిబట్టి తెలుగుదేశం అగ్రనాయకత్వం తమ అధికారాన్ని శాశ్వతీకరించుకోడానికి పెద్ద వ్యూహాన్నే పన్నినట్లుంది. ఆ పథకాన్ని గూర్చి, ఆ వ్యూహాన్నిగూర్చి శిక్షణ శిబిరాలలో పార్టీ సభ్యులకు నూరిపోస్తున్నారో ఏమో? ప్రతిగ్రామంలో ఒకరికో, లేక కొందరికో తమ పార్టీలో ముఖ్యులైన వారికి గుర్తింపు కార్డులవంటివి జారీ చేస్తారట. అవి కలిగినవారు చెప్పిన పనులే చేయవలసిందని, ఇతరులను దగ్గరకు రానివ్వకూడదని మండలాధికార్లకు గట్టిగా హుకుం జారీచేస్తారట. అవిధంగా గ్రామస్థాయివరకు పార్టీని సువ్యవస్థీకరిస్తారట. వారిపథకం వ్యూహం ఇదీఅని నెల్లూరులో దట్టమైన వదంతి. ఇంతవరకు అటువంటి కార్డులెవ్వరికీ ఇచ్చినట్లులేదు. బహుశా సమితులు పంచాయతీలను రద్దు చేయడంద్వారా 'ఇతరుల' పీడవదిలించుకొని, ఆపిమ్మట తమపథకాన్ని అమలులో పెట్టవచ్చునేమో నంటారు. చంద్రబాబునాయుడు ప్రతిజిల్లా తిరుగుతున్నారంటే ఏదో పెద్దపనే వుండివుండాలి!

ఏమైనా తెలుగుదేశం ప్రజాస్వామ్యాన్ని గొంతు పిసకబోతుంది. ఇటు

—కొరవ 7 వ పేజీలో

## గేట్ కీపర్‌గా హోం మంత్రి

చంద్రబాబునాయుడు ఏ జిల్లాకు వెళ్ళినా, కొమ్ములుదిరిగినవాయకులు కూడా ఛత్ర, చామరాలు ఎత్తి పట్టి వింజామరలు వీస్తున్నారు. అన్నిటిలోకి 16 తేది ఉదయం విజయవాడలో జరిగిన స్వాగత సత్కారాలు నభూతోనభవిష్యతి అంటున్నారు, పరిశీలకులు.

బాబుగారు గగనం నుంచి కాలు క్రిందమోపేవేళకు, గన్నవరం విమానాశ్రయం కార్లతో కిటకిటలాడిపోయిందట. ముఖ్యమంత్రికికూడా ఎవ్వరూ ఇంత స్వాగతం లభించలేదంటారు. బాబుగారి వెనుక, దాదాపు ఒక కిలోమీటరు పొడవునా కార్లబారు ఏర్పడిందట.

తర్వాత అతిథిగృహంలో జరిగిన రాచమర్యాదలుకూడా, అన్నిన్ని కావు. వి వి వి ఐ పి స్థాయిలో బందోబస్తు; సాక్షాత్తు హోంమంత్రి శ్రీ వసంత నాగేశ్వరరావు ఈ ఏర్పాట్లన్నింటినీ పర్యవేక్షించడమేకాక, గేటుదగ్గర 'కీపర్' గా నిలబడి, బాబుగారి దర్శనార్థం వచ్చిన పెద్దలను వరుసక్రమంలో ఒక్కొక్కరిగా లోపలకు పంపించాడట. ముఖ్యమంత్రి కోసం నడివీధిలో మాత చిందులేసిన ఈ సచివోత్తముడు, ద్వారపాలకుడి ఉద్యోగం చేయడంలో వింతేమీలేదు కాని, ముఖ్యమంత్రులనే శాసించే స్థాయిగల్గిన విజయవాడ 'సిద్ధార్థ' కుబేరులుకూడా చేతులుగట్టుకొని వినయంగా నిలబడి, బయట వేచివుండడం విచిత్రంగా కన్పించిందన్నారు, చూచినవారు.

# నల్లేరుపై బండిలాగా జి. ప. ను నడిపిస్తున్నాడు ఎల్లసిరి!

"మూ, జికల్ ఛేర్స్" ఆటను తలపించే రాజకీయ క్రీడలో, మూడవ వాత్సారిక జిల్లాపరిషత్ ఛైర్మన్‌గా గద్దెనెక్కిన శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డిపై జనాభిప్రాయమేమిటి? అసలు జిల్లా పరిషత్ కి పుంటాయో, ఊడుతాయో, ఏ క్షణంలో అన్యాగాని రద్దుల ప్రస్తావన కలుగుతాయో తెలియని సంధిగ్ధంలో ఈ ప్రశ్న వేసుకోవడం అసంబద్ధమన్నమాట నిజమే; కాని, తెలుగుదేశం ఏర్పాటా అని జి ప. ఛైర్మన్ పదవి సున్నా ఊతేముక్కలా అయ్యారైంది. ఒక్క నెల్లూరుజిల్లాయేగారు రాష్ట్రమంతటా ఏ స్థితియుతే. ఈ సంస్థలో వ్యక్తులెవరైనా, వారి పదవి భోగం మూడ్నాళ్ళ ముచ్చటే లెక్క. ఆ మూడునాళ్లు కూడా మూడు నెలల్లో వారెట్లావున్నారు అంటేరిజా చెయకోవ. సందేశప్పి సంవత్సరాలు గడిచినా. సమర్ధత అంచనావేయటానికి సావకాశముండదు.

ఈ కోణంలో నుంచి చూసినప్పుడు శ్రీనివాసులురెడ్డి 'హయాం' ఎట్లావుందో పరిశీలించుకోవడం ఔచిత్యం కాదని మా ఉద్దేశ్యం. ఆయన 'హయాం'ను అంచనావేయడం మరీ తొందరపాటను కుంటే - బాలచెన్నయ్య పరిపాలనతో పోల్చి చూడవచ్చు.

సమకాలీన చరిత్రలో బాలచెన్నయ్య జి ప.పరిపాలన ఒకపిడిగల వ్యక్తిగా రాజ

> మంత్రి మద్దతు
> అధికారుల అండ
> పార్టీలో బలం
> ఆయన పని
> సుకరం చేశాయి!

కీయానుభవశూన్యుడు కావడం, సమర్థుడు కాకపోవడం, పార్టీలో మున్నూట అరవై రోజులు రాజ్యంచేసిన అసమ్మతి, అసంతృప్తివాదుల బెడద - ఆయన్ను భ్రష్టు పట్టించినాయి; జిల్లాపరిషత్‌ను నిర్వీర్యం చేసినాయి. సుజాతారావు వంటి కలెక్టరు చేయూతనిచ్చినా, సద్వినియోగం చేసుకో లేకపోయాడాయన.

కారుడ్రైవరు, క్యాంప్ క్లర్కులనుంచి నిధుల కేటాయింపులు, నియామకాల వరకు ఏపనీ స్వతంత్రించి చేయలేకపోవడం, సిబ్బందిపై అదుపు, వారి అభిమానం లేదా భయం పొందలేకపోవడం బాలచెన్నయ్య వైఫల్యానికి ప్రధాన కారణం. ఈ కోణంలో ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, వ్యక్తిత్వం గలవాడుగానే కన్పడుతున్నాడు. తన ఆఫీసు మేనేజర్ నుంచి, టీచర్లు హెడ్మాస్టర్ల, బదిలీలు ఇత్యాదులను స్వతంత్రంగా చేసుకోగల్గుతున్నాడు. పైకి పొక్కడం లేదో, లేక అసలే లేదో తెలియదుగాని, పూర్వంవలె బదిలీలు, నియామకాల తతంగంలో అవినీతి కంపు కొట్టడంలేదు. గుర్తించదగిన తేడా ఇది. దీనివల్లేననుకుంటాము, జి ప ఆఫీసు ఇదివరకువలె అబందరగా కాక - క్రమపద్ధతిలో కన్పిస్తూంది.

'దక్షిణా'నికి అభిముఖంగా నిలబడగల్గినా 'ఉత్తరాల' దురలవాటుకుమాత్రం శ్రీనివాసులురెడ్డి అతీతుడుగా లేడు. ఏ రాజకీయ నాయకుడికీ ఇది తప్పదనుకోండి!

—కొరవ 11వ పేజీలో



# పినాకినీ తీరం

### రామమూర్తి జవాబు

జిల్లా జనతాపార్టీ ఎన్నికలకు సంబంధించి 4 తేది సంచికలో నేను చేసిన వ్యాఖ్యలకు ప్రస్తుతి శ్రీ జి. రామమూర్తి జవాబు వ్రాశారు.

ఆయన జవాబు నుండి నేను సవరించుకోవలసిన విషయం ఒకటుంది. జిల్లా జనతాపార్టీ అధ్యక్షతకు రామమూర్తి అభ్యర్థి కాదట. ఆయన శ్రీ ఎం. మాధవరావును (కావలి) తన అభ్యర్థిగా ప్రతిపాదించాడట. ఈ పొరపాటుకు నేను విచారం ప్రకటిస్తున్నాను.

స్వార్థపరులతో కూడిన జిల్లా జనతాపార్టీ ప్రక్షాళనకే తాను రంగంలోకి దిగవలసివచ్చిందని రామమూర్తిగారు అంటున్నారు: ఎన్నిక సమావేశానికి హాజరైనవారు సభ్యులుకారని ధనబలంతో కొనుక్కున్న జనం అనికూడా ఆయనంటారు. ఇంకా తన కాంట్రాక్టు వగైరాల విషయం కూడా ఆయన జవాబులో ప్రస్తావించారు.

నెల్లూరు జనతాపార్టీ స్వార్థపరులతో కూడింది కావచ్చు; వారు ధనబలంతో జనాన్ని తెచ్చుకొని వుండవచ్చు. వారి విషయం రామమూర్తికి తెలిసినంత లోతుగా నాకు తెలియకపోవచ్చు. కాని, నాకు ఒక్కవిషయంమాత్రంబాగతెలుసు - వీరంతా జి. సి. కొండయ్యగారు పెట్టినవారు; ఆయనకు విశ్వాసపాత్రంగావున్నవారు: ఆయన ఏమిచేయమంటే అది చేసినవారు. అంతేకాదు. వీరంతా కొండయ్య ఏ పార్టీలో వుంటే, ఏ వర్గంలో వుంటే అక్కడ వున్నవారు. అటువంటివారు స్వార్థపరులైనా, ధనవంతులైనా వారిని పెట్టినందుకు కొండయ్యగార్ని నిందించాలి. నిందిద్దామా? ఆ కీర్తిశేషుని విషయంలో ఇప్పుడు నేనాపనిచేయలేను.

జనతాపార్టీలోని రాయల్‌రెడ్డి వర్గం, అంటే కొండయ్యగారి వర్గం - ఇచ్చిన నాలుగుపేర్లను రామమూర్తిగారు తీసివేయమన్నారట. నా అభిప్రాయంలో కూడా వారు తీసివేయతగినవారే. ఎందువల్లనంటే కొండయ్యగారి నమ్మినబంట్లని తప్ప, మరోవిశేషం లేనివారు. అంటే రాజకీయాల్లో ఏవిధంగానూ పరిగణనకు వచ్చేవారుకాదు వ్యక్తిగతంగా తమకు ఏమి అపకారంజరిగినా, వారు మిత్రద్రోహానికి పాల్పడేవారు కాదు కాని, రామమూర్తిపేరితో వంతో ఏమిచేయ వలసినదైనా సంసిద్ధులయ్యేవారైతే, అసలు గురిలో కక్షసం ఒకరివల్ల కొండయ్యగారికి సంబంధించిన ఎన్నో విషయాలు పల్లదయ్యే అవకాశముంటుంది. ఇంతకూ నేను చెప్పదలచింది వారిపేద కోపంతో రామమూర్తి తన తండ్రికే అపకారం చేస్తున్నాడేమోనని! అది ఆయనకు ఇష్టమైతే, సంతోషమైతే ఇతరులకు అభ్యంతరం వుండవలసిన అవసరంలేదు.

రామమూర్తిగారూ! మీకేకాదు. ప్రతి ఒక్కరికి ఆ క్షణంవరకు "వాస్తవ చిత్రీకరణకు దర్పణం పట్టే సాధనంగా" కనపడే 'జమీన్‌రైతు', ఏదైనా విమర్శకు గురియైన మరుక్షణం నుండి "అభిప్రాయం మార్చుకోవలసివస్తుంది." ఇది అనాదిగా నా బోటి వాని అనుభవానికి వస్తున్న సత్యం. అందువల్ల ఈనాడు జమీన్‌రైతు విషయంలో మీ అభిప్రాయంలో వచ్చిన మార్పుగాని, మీ విమర్శలుగాని నాకు కించిత్‌కూడా ఆశ్చర్యం కల్గించడంలేదు. మా వైఖరి అనాడూ ఈనాడు ఒకటే; మార్పు ఏదైనా వస్తే ఎదటివారిలో రావలసిందే. ఈ వాస్తవాన్ని మీరు గ్రహించాలని నా కోర్కె. అంతేకాదు. ఉజ్జ్వల భవిష్యత్తుకు అవకాశమున్న మీబోటి యువకులకు వులికిపాటు మంచిది కాదేమోనని నా అభిప్రాయం.

ఆఖరుగా ఒక అనుమానం: మాధవరావుగారు లోక్‌దళీయుడుకాదా? జనతాపార్టీలో ఎప్పుడుచేరాడు?

### హాజీ మస్తాన్ దర్శనానికి గూడూరునుండి...

తనపార్టీయైన "దళిత్ ముస్లిం మైనారిటీస్ సురక్ష మహాసంఘం" ఆంధ్ర రాష్ట్రశాఖకు ప్రారంభోత్సవం జరపడానికి హాజీ మస్తాన్ అదిపని - విజయవాడరావడం కొందరికి ఆశ్చర్యంకల్గించి వుండవచ్చు. పేరు మోసిన స్మగ్లర్ఏంటి, పార్టీఏంటి అని అనుకోవచ్చు. కాని మన దేశంలో రాష్ట్రంలోనే - దు, నెల్లూరు జిల్లాలోకూడా హాజీ మస్తాన్ అభిమానులున్నారంటే నిజంగానే మీకు సంభ్రమాశ్చర్యాలు కలిగితీరుతాయి.

ఆమధ్య మద్రాసునుండి రైల్లో నెల్లూరువస్తుంటే గూడూరు ప్రయాణీకులొకరు తన పరిచయస్తులైన ప్రక్కవారికి చెప్తున్నారు. అతను, అతని పరిచితుల్లు కూడా రైల్వే వుద్యోగులని, అతను గూడూరులో వుంటున్నాడని అతని మాటలనుబట్టి గ్రాహ్యమైంది గూడూరులోని తాను, తన మిత్రులు, మరికొందరు మిత్రులుచేరి స్పెషల్‌బస్సు వేసుకొని 'హాజీ'సిద్ధాన్ని చిత్తం ఒకసారికి బొంబయికి పోయారట; మస్తాన్ ఇంటిముందు గంటల తరబడి కొలువుచేశారట; ఒక్కసారి కనబడితే ధన్యులమయ్యామనే

—కొరవ 8వ పేజీలో

# జమీన్‌రైతు

## దురహంకారం!

లిబియామీద అమెరికా దాడికి కారణం దురహంకారమే, దుస్సాహసమే, దుర్బుద్ధే; సందేహంలేదు!

తాను సుసంపన్నదేశం, అగ్రరాజ్యం; అన్నిరంగాలలో అభివృద్ధిలో వుండడమే కాదు, అధునాతన మారణాయుధాల వుత్పత్తి నిల్వలలో సాటిలేనిదేశం; విటన్నిటికితోడు ధనంతో కొనుగోలు చేయడంద్వారానో, బలంతో అణచివేయడంద్వారానో అధిక్యతను నిలబెట్టుకోవాలనే ప్రళయాంతకమైన దుర్బుద్ధికలిగిన రీగన్ వంటి వ్యక్తులు ప్రభుత్వాధినేతలవుతున్న దేశం. ధనము బలము కలిస్తే, వాటిని శాంతిసౌభాగ్యాలకు కాకుండా విలయానికి ప్రళయానికి వుపయోగించే ప్రబుద్ధులు పాలకులైతే ఏమిజరగాల్నో నాటి వీట్‌నాం మొదలు నేటి లిబియావరకు అదేజరుగుతున్నది. ఎన్ని అపజయాలు, అవమానాలు ఎదురైనా అమెరికాకు బుద్ధిరావడంలేదు; అదే దురదృష్టం!

లిబియా ప్రెసిడెంటు గడాఫి యూరప్ దేశాలలో వుగ్రవాదాన్ని ప్రోత్సహిస్తున్నాడని, అమెరికన్లను చంపుతున్నాడని అతనికి బుద్ధిచెప్పడానికే తాను లిబియామీద దాడిజరిపించానని అమెరికా ప్రెసిడెంటు రీగన్ గొప్పగాచెప్పుకున్నాడు. ఆ విషయంలో గడాఫి నిర్దోషి అని ఎవ్వరూ అనడంలేదు, అతనిని ఎవ్వరూసమర్థించడంలేదు. కాని అమెరికా చేస్తున్నదేమిటి? దాని ఆయుధాల సరఫరా ఎవరికి? ఆర్థికసాయం ఎవరికి? ప్రజాస్వామ్యదేశాలలో చిచ్చుపెట్టే నిరంకుశ ప్రభువులకు, విచ్ఛిన్నశక్తులకు కాదా? పంజాబు వుగ్రవాదులకు అమెరికాలో శిక్షణశాలలు నిర్వహింపబడడంలేదా? వుగ్రవాదులను వుసిగొల్పి మనదేశంమీదకు పంపుతున్న పాకిస్తానకు అన్నివిధాల సహాయ సహకారాల నందిస్తున్నది అమెరికాకాదా? లిబియానేత గడాఫీమీద అతని చేష్టలవల్ల ప్రపంచ సానుభూతి తగ్గింది. కాని అమెరికా దాడివల్ల దాదాపు ప్రపంచ దేశాలన్నీ ఒకటై అతనికే మద్దతును ప్రకటించాయి; అమెరికా చర్యను నిరసించాయి. ఈనాడు అమెరికా ఏకాకి; బహుశా అమెరికాకు స్థావరాల సౌకర్యం కల్గించిన థాచరమ్మ ప్రధానిగాగల్గిన కుంటి బ్రిటన్‌కూడా అమెరికాను బహిరంగంగా బలపరచడానికి సిగ్గుపడవచ్చు!

కాలం మారింది; అగ్రరాజ్యాలంగదా అని ఇష్టమొచ్చినట్లు ఆడితే సాగేరోజులు పోయాయి; దాడులు, దురాక్రమణలను అందరూ కలసి ప్రతిఘటించే పరిస్థితులు ఏర్పడినాయి. అమెరికా దాడిపట్ల ఢిల్లీలో జరుగుతున్న అలీనదేశాలు ముక్తకంఠంతో ప్రకటించిన ఆందోళన నిరసనలే ఇందుకు నిదర్శనం. అంతేకాదు ప్రపంచంలోని ఏ దేశమూ అమెరికా చర్యను సమర్థించలేనిస్థితి ఏర్పడటం గమనార్హం. ఈ మార్పును అమెరికా గ్రహించగలుగుతుందా? రీగన్‌కి జ్ఞానోదయం కలుగుతుందా? లేకుంటే వారికి పరాభవము, పతనమే కాదు, ప్రపంచ శాంతికికూడా ముప్పే!



## జమీన్ రైతు

17-4-1936

### సంస్కృత కళాశాల భూరిదానం

నెల్లూరు వేదసంస్కృత కళాశాల ఉదారమహాశయుల యాదరణకుపాత్రై వారివలన యుచితరీతిన సహాయమును పొందుచున్నది. శ్రీయుతులు వల్లూరు పుండరీకాక్షంగారు పైపాఠశాలకు చేసినదానము ఇదివరలో ప్రకటితమైయున్నది. ఇటీవల కోవూరుతాలూకా గండవరం గ్రామ కాపురస్థుడు శ్రీయుత బుర్రా వెంకట సుబ్బారెడ్డిగారు క్రొత్తవంగల్లు గ్రామంలోని య 3-54½ టు మాగాణి భూమిని కీర్తిశేషులగు తన ధర్మపత్నుల ఆత్మశాంతికై, వారిజ్ఞాపకార్థముగ నెల్లూరు మూలపేటలోని వేద సంస్కృత పాఠశాలలో వేద వేదాంగములలో నేదైన చదువు బ్రాహ్మణ విద్యార్థుల భోజనార్థమై దానముచేసి 9-3-36 తేదిన దాన పత్రమును వ్రాయించి రిజిష్టరుచేసి యిచ్చియున్నారు. ఈ ఫసలీ మక్తా ధాన్యంనహా పాఠశాలకు చెందునటుల ఏర్పాటు చేయబడియున్నది. శ్రీ రెడ్డిగారికి కృతజ్ఞులమైయున్నాము.

—జంగుప శ్రీకృష్ణయ్య.

### నెల్లూరు ముచ్చట్లు

నెల్లూరు మంగలవీధిలో బావిరిపేరు అయిన తర్వాత కొంతరాళ్లను

## 50 ఏళ్ల క్రితం ఈవారం

ఓవర్‌శీరుగారు చీటీవ్రాసి తెప్పించుకుని, కంట్రాక్టరు ఎత్తుకొని పోయినాడని కమీషనరుగారితో చెప్పినారని తెలుస్తున్నది. చీటీవ్రాసి పంపింది మరిచారేమో? పాపం ఆ చీటీని కంట్రాక్టరు భద్రపరతకుండా వుంటే అతని గతి ఏమికావాలి?

• • •

వైస్‌ఛేర్మన్ ఆర్. ఎల్. రెడ్డిగారు మీటింగులకు అధ్యక్షత వహించి నప్పుడు కొంచెం కఠినంగా వుంటేనే గాని, అధ్యక్షస్థానం గౌరవం కాపాడలేరు.

వెంకటగిరి ఎస్టేటు కథలు 'రూక గొడ్డుకు మాడబందె' అన్నట్లు రూ 70 ల జీతగానికి రూ 300 ల బత్తా ప్రపంచ చరిత్రలో ఎన్నడైనా కనివిని ఎరుంగుదురా, వెంకటగిరి గుడ్డి దొరతనంలో తప్ప.

• • •

వెలికల్లు విచారణలో నాయుడుగారికి వ్యతిరేకంగా నడిచాడనే మిషతో వెంకటగిరి తాలూకా ఆఫీసు సివిలు గుమాస్తా కాశప్పగారికి సస్పెండ్ అయిందట. ఔను, మహా మహా ఆఫీసర్లే గడగడలాడిపోతుంటే, ఈ దోమలెందుకట నత్యానత్య వివేచన?

• • •

అర్లంపాటి పెద్దకొంపలమీద ఆ జప్తిలేమిటి? అఘోరాలేమిటి? యెన్నాళ్లు భరిస్తారు కొనయూపిరితో రైతుబృందం?

★

# తగ్గించిన శిస్తయినా రైతుకు దక్కదా?

ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుగారు ఆమధ్య "దేవుడిచ్చిన భూమికి శిస్తేలరైతన్నా" అనే బరువైన సినిమా డైలాగులు వల్లించి, శిస్తు రద్దుచేసినట్లు ప్రకటించారు. కానీ అధికారులుమాత్రం మెట్టశిస్తువరకే రద్దయిందని, నీటితీరువా, సెస్సులు రద్దుకాలేదని, ఎకరాకు రు. 10 లు మాత్రం తగ్గించి దండుతున్నారు.

భూముల తరమునుబట్టి మెట్టశిస్తు రు 9-27 ల నుంచి రు. 18-54 ల వరకు పడుతుంది. కోవూరు డెల్టా ప్రాంతంలో పొలాలు ఎక్కువ భాగం 4 తరం వరకు వున్నవే. ఈ 4 నంబరులో మెట్టశిస్తు రు 14-42 లు; అధికారులు తగ్గిస్తున్న రు 10-00 ల శిస్తు తగ్గింపువల్ల 9 తరం నంబరు పొలాలకు మాత్రమే ప్రయోజనం.

మెట్టశిస్తు అనేది పూర్తిగా రద్దయివుంటే, ఈ తరాల నంబర్ల ప్రకారం లెక్కగట్టి, శిస్తుమొత్తం తగ్గించి సెస్సులు మొత్తం వసూలు చేయడం అధికారుల ధర్మం. అట్లా చేయకుంటే, ప్రభుత్వం ఇచ్చిన మినహాయింపు రైతులకు అందకుండా పోతుంది. కలెక్టరుగారు ఈ అన్యాయాన్ని సవరించాలని విజ్ఞప్తి.

కోవూరు —పచ్చిపాల ప్రభాకరరెడ్డి

### ఇటువంటి డాక్టర్లు ఇంకా వున్నారా?

మనకెల్లాకు, మనకు సంబంధం లేకపోయినా, అత్యంత అరుదుగా తారసపడే సంఘటనకాబట్టి చెప్పవలసివస్తూంది. ఇటీవల బెంగుళూరులో, ఒక నెల్లూరు యువతికి అనారోగ్యం తటస్థించింది. చికిత్సకు సి. ఎస్. ఐ. ఆస్పత్రిలో చేర్పించారు. డాక్టర్ హైమవతి అనే పేరున్న డాక్టర్ ఆమెకు వైద్యం చేస్తుండింది. ఒకరోజు హఠాత్తుగా రోగికి పెద్ద మొత్తంలో రక్తం ఎక్కించవలసివచ్చింది. ఆమెకు సరిపాయే గ్రూపురక్తం దొరకలేదు; అలస్యంచేస్తే రోగికి ప్రాణాపికే ప్రమాదం. అందరూ ఆదుర్దాగా వున్నసమయంలో, శక్తితో పనిబడి, డాక్టరమ్మకుమార్తె ఇస్కెండేళ్ళ బాలిక ఆస్పత్రికి వచ్చింది. ఆ పాప రక్తం గ్రూపు, రోగికి సరిపోతుందట. అంతే, డాక్టర్‌గారు క్షణం సందేహించకుండా, తన కూతురునుంచి రక్తం తీసుకొని, రోగికి ఎక్కించి, ప్రాణాలు కాపాడింది:

ముక్కు ముఖం తెలియని రోగికోసం, కన్నకూతురు రక్తం తీసుకొనడానికి వెనుకాడలేదంటే, ఇక ఆ డాక్టరమ్మ సేవాదృష్టి, వృత్తిపై మమకారం ఎటువంటివో ఆలోచించుకోవచ్చు. ఇప్పట్లోకూడా ఇటువంటి డాక్టర్లున్నారాఅనిఆశ్చర్యమేసింది. ఆ మహామనీషికి కోటి నమస్కారాలు

నెల్లూరు —విస్సా రామచంద్రరావు

## జనవాణి

### గోతులమయమైన ములుమూడి బస్టాండు

ములుమూడి బస్టాండులో ఘనత వహించిన నెల్లూరుమునిసిపాలిటి డ్రైనేజికోసంకాబోలు, గోతులు తీసింది. చిన్నబజారు మొగుదాలనుంచి పాతపెద్దాస్పత్రి రోడ్డులోని పార్కువరకు రోడ్డులో 3 అడుగులలోతు కాలవ త్రవ్విపారేశారు.

ఈ కాలువత్రవ్వి రెండునెలలైంది; దాని అతీగతీ పట్టించుకున్నవారులేరు; పైపులులేవని కాంట్రాక్టరు పనినిల్పేసి, సేదతీర్చుకుంటున్నాడట. ఈసందులో కాపురాలుండేవారు, ఆ గోతులపైన సర్కస్‌ఫీట్లుచేస్తూ తిరగాల్సివస్తుంది. పైపులులేవని తెలిసీ, ఇంతముందుగా కాలవలెందుకు త్రవ్వాలి? పౌరుల ప్రాణాలు తోడెయ్యడమంటే సిబ్బందికి అంతసరదాగావుందా?

నెల్లూరు —కె. బాలరాజు.

నెల్లూరు సంగతులు

# 'ఎమ్. ఎస్. కృష్ణమూర్తి ప్రజ్ఞ సర్వ వ్యాపితం కావాలి'!

చిత్రం, నృత్యం, శిల్పం, సాహిత్యంవంటి అంగాలన్నింటిపైన సాధికరమైన పాండిత్యంతో, అనర్గళ నిరంతర విజ్ఞాన ఝరీలా ఉండే శ్రీ ఎమ్. ఎస్. కృష్ణమూర్తి, సహస్రమాస జీవి కావాలని, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆశీర్వదించారు.

13 వతేదీ సాయంత్రం టౌన్‌హాల్‌లో జరిగిన శ్రీ ఎమ్. ఎస్. కృష్ణమూర్తి సన్మానసభలో ఆయన ప్రసంగించారు. కృష్ణమూర్తి ప్రజ్ఞ ప్రతిభ ఒక పుష్పం వలె వికసించి, దాని పరిమళం పాటించేంత సమాజంలో వ్యాపించడానికి అందరి సహకారం కావాలని గోపాలరెడ్డిగారన్నారు. కృష్ణమూర్తి రచనలను అచ్చు రూపంలో పెట్టాలనడం ఆయన కర్తవ్యంగా వున్నట్లుంది.

పట్టిమాటలుకాదు, గోపాలరెడ్డిగారు కట్టుగాలవలెకూడా శ్రీ కృష్ణమూర్తిని సత్కరించారు ఆయనతోపాటు పి.వి. రమణారెడ్డి, వి. అనంతరామయ్య, డాక్టర్ మధుసూదనశాస్త్రి, సర్వోదయ ప్రిన్సిపాల్ ఎ మాధవరావు, వి. ఆర్. కాలేజి తరఫున సీతారామమూర్తి తదితరులు కూడా ఆయనను సత్కరించారు.

సన్మానసంఘం, 23 వేల రూపాయల విరాళం సేకరించిందట- అందులో 20 వేలు నూతన వస్త్రాలతో కలిపి సమర్పించారు. ఈ సభను జిల్లాకలెక్టర్ శ్రీ శివసాంబమూర్తి అధ్యక్షించి, కృష్ణమూర్తిగారి నూతన పుస్తకం 'సప్తస్వర'ను ఆవిష్కరించారు వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ జగన్నాథరెడ్డి వెంకటరెడ్డి సన్మాన పత్రం చదివారు. శ్రీ వేదం వెంకట్రామశాస్త్రి స్వాగతం చెప్పి, సందేశాలు చదివి, సన్మానసంఘం లెక్క పక్కలు వివరించారు.

ఎమ్. ఎస్. కృష్ణమూర్తి ఏకసర్వజన ప్రియుడో, సభకువచ్చిన శ్రోతలను చూస్తేనే ద్యోతకమైపోతుంది న్యాయవాదులు

ఎమ్. ఎస్. కృష్ణమూర్తి

కాలేజి లెక్చరర్లు సాహిత్యప్రియులతో సభ కళకళలాడింది

## ప్రకృతి ప్రియులారా ఏకంకండి...

....అని పిలుస్తున్నారు, డాక్టర్ కె. ఆర్. రెడ్డి. నెల్లూరు టౌన్‌లో, జిల్లాలో వృక్షసంపద పెంపొందింప చేయడానికి, పచ్చదనంతో పరిసరాలను కళకళలాడింప చేయడానికి ఆయన 'స్కాన్-నెల్లూరు' అనేసంస్థను నెలకొల్పారు. స్విట్జర్లండులోని ప్రపంచ వన్యమృగసంస్థ (వరల్డ్ వైల్డ్ లైఫ్ ఫండ్) అంతర్జాతీయాశాఖకు దీనిని అనుబంధంచేశారు. ఎక్కడవీలైతే అక్కడల్లా నేచర్‌క్లబ్‌లు నెలకొల్పడం, ప్రకృతి ఆరాధకులను ఐక్యంచేయడం, వారిలో ప్రకృతిసంపద పరిరక్షణ, అభివృద్ధికట్ల ఆసక్తిని పెంపొందింపచేయడం ఈ స్కాన్-నెల్లూరు ఆశయమట. ఇందుకోసం స్వచ్ఛందసంస్థలు, యువకులు, విద్యార్థులు....అందరూ కలసిరావాలని పిలుస్తున్నారాయన. నేచర్ క్లబ్ లు చెట్లు నాటించడానికి, నరికే కార్యక్రమాన్ని నిరోధించడానికి అధికారులపై వత్తిడి తెస్తాయి. పెరళ్లలో, వీధుల్లో చెట్లునాటవలసిందిగా ప్రజలకు ప్రచారంచేస్తాయి.

డాక్టర్ కె. ఆర్. రెడ్డి కంభంలో పశుసంవర్ధకశాఖ అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేస్తున్నారు; నెల్లూరీయుడు. ఈ సంఘంగురించి ఎవరికైనా ఆసక్తివుంటే- డాక్టర్ కె. ఆర్ రెడ్డి, 1/548, బంగళాతోట, నెల్లూరు-2 అన్న చిరునామాకు వ్రాయండి.

## సెంట్రల్ స్కూల్ వార్షికోత్సవం

మంచి విద్యాబోధన, ఉత్తమమైన క్రమశిక్షణలతో, అతి స్వల్పకాలంలోనే టౌన్‌లో మంచి స్కూలుగా పేరుపొందిన నెల్లూరు సెంట్రల్ స్కూలు తృతీయ వార్షికోత్సవం ఇటీవల వేడుకగా జరిగింది. శ్రీ ఆనం సంజీవరెడ్డి, శ్రీ హరి

—కొరవ 11వ పేజీలో

## ★ ★ నామాట ★ ★

- మండపాలవీధిలో మరో బర్మాబజార్
- నిస్పృహతో దేశం వదలి వెళ్తున్న నెల్లూరు యువశాస్త్రవేత్త

ఏదిదో కొనాలనుకొంటున్నారా? బంగారు బిస్కట్లపై మోజుపడ్డా-? నొక్కితే సంగీతంపలికే బిలిఫోన్ పెట్టుకోవాలనుకొంటున్నారా?

ఫారెన్ సెంట్లు రాసుకొని ఘుమఘుమలాడాలని ఉబలాటపడుతున్నారా?

ఇవన్నీ అందని ద్రాక్షపళ్ళని నిరాశ చెందవద్దు; జేబునిండా నోట్లుకుక్కొని నేరుగా మండపాలవీధికి నడవండి. మీరు కోరినవస్తువెల్లావచ్చి వడిలో వాలకుంటే అప్పుడడగండి.

నేనీమాట, ఊసుపోకకు చెప్పడం లేదు; మీకు లేనిపోని ఆశలుకల్పించడం, తప్పుదారి పట్టించడంకూడా నాఉద్దేశ్యం కాదు. ఫారెనింపోర్టెడ్ సరుకుపై మోజుతో మద్రాసువంటి దూరాభారాలేగకుండా, దగ్గరదారి చూపిస్తున్నాను. నన్ను నమ్మండి! కాలిక్యులేటర్‌నుంచి, కంప్యూటర్‌వరకు; బ్లూఫిల్ములనుంచి బంగారు బిస్కెట్లవరకు; కళ్ళజోళ్ళనుంచి, కళ్ళు మిరుమిట్లుగొల్పే చీరలదాకా; టి. వి. ల నుంచి టేప్‌రికార్డర్లవరకు-మీకేమికావాలో చెప్పడమే మీవంతు, తెచ్చి మీచేతిలో వుంచడానికి అక్కడ ఎందరో వేచి వున్నారు.

మద్రాసులోవలె ఇక్కడ మోసం, దగా భయంలేదు పాపం వారు చాలా 'భయస్తులు'; అధికారుల బెడద అసలేలేదు- పోలీసుస్టేషన్కే పేసు మహారాజ పోషకులు; దరగురించి చింతవద్దు మద్రాసుకంటే సరసమైని ధరలు; బంగళా అద్దాలకై ఆందోళన పలదు కాని వలదు; ఎందెందు వెతికిచూచిన అందందుగలవు.

### డోలేంద్ర

మండపాలవీధి మరో బర్మాబజార్ అయిపోయిందని ఆమధ్య నామిత్రుడొకడు చెపితే, అదేందో చూద్దామని వెళ్ళాను; వెళ్ళినతర్వాత అనిపించింది - మద్రాసు బర్మాబజారే మన అడుగుజాడల్లో నడుస్తుందేమోనని!

అరంకణం మించని స్థలం, కుదువ అంగడనిబోర్డు; పట్టుపరుపులపై అమాయకపు ముఖాలతో సుఖాసీనులైన ఒకరో, ఇద్దరో మార్వాడీలు. బజారులో ఏ అంగడి చూసినా ఇదేదృశ్యం. రోడ్లో నడిచే వారికి, జనమేలేని ఆ ఖాళీకొట్లనిచూస్తే, పాపం, దివాలాతీసిన వ్యాపారులేమోనని జాలికల్గుతుంది. కాని గృహతర్వా

-కొరవ 8 వ పేజీలో

# త్రివేణీ సంగమం - 'సంగం'

మనం నిత్యం ఎన్నోఊళ్ళు తిరుగుతుంటాం; వాటిపేర్లు వింటుంటాం. ఐతే వాటికి ఆ పేర్లెందుకుపెట్టారో మనకు తెలియదు. ఈ నామనిర్ణయానికి వెనుక వున్న నేపథ్యం, వాటికి ప్రేరకం ఏమిటోకూడా మనకు తెలియదు.

ఊర్లు, వాటిపేర్లవెనుకవున్న అర్థం, చరిత్ర, ఆయాపేర్లను ప్రేరేపించిన సంఘటనలు, సన్నివేశాలు ప్రాధాన్యతలను పరిశోధించడానికి ఇప్పుడిప్పుడే ప్రపంచ వ్యాప్తంగా పలుసంఘాలు ఏర్పడుతున్నాయి అటువంటివాటిలో ఒకటి- భారత స్థలనామ పరిశోధకసంస్థ మైసూరు విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్సలర్ డాక్టర్ దేవగౌడ జవేరిగౌడ దీని స్థాపకులు. 1978 లో ఇది ఏర్పడింది.

ఈ సంఘం అధ్వర్యంలో ప్రతి ఏటా సమావేశాలు జరుగుతాయి. ఆయా ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలు వీటిని నిర్వహిస్తుంటాయి. గత సంవత్సరం ఈ సమావేశాన్ని నాగార్జున విశ్వవిద్యాలయం స్పాన్సర్ చేసింది: ఈ ఏడాది ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ విశ్వవిద్యాలయంలో జరిగింది. ఈసంస్థకు నాగార్జున విశ్వవిద్యాలయం ప్రొఫెసర్, డాక్టర్ యార్లగడ్డ బాలగంగాధరరావు ఉపాధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు.

గోరఖ్‌పూర్ విశ్వవిద్యాలయం సమావేశంలో దేశవ్యాప్తంగా వచ్చిన ఇతర చారిత్రకపరిశోధకులు, నామశాస్త్రవేత్తలతోపాటు నేనుకూడా ఒక పరిశోధనాపత్రం సమర్పించాను. గోరఖ్‌పూర్ నిజనామాన్వేషణ నా పత్రం పుద్దేశ్యం.

గోరఖ్‌పూర్ అసలుపేరు, గోరక్షక్‌పూర్. మహాభారతంలో వర్ణించిన ఉత్తర గోగ్రహణం ఇక్కడనే జరిగిందని, స్థానికుల నమ్మకం. అర్జునుడు, కౌరవులబారినుంచి గోవులను ఈచోటనే రక్షించాడని కథలు ప్రచారంలో వున్నాయి.

### ఊరు-పేరు
వావింటపర్తి కృష్ణరావు

ఇక్కడ గోరఖ్‌నాథ్‌దేవాలయంవుంది. ఈయన ఈశ్వరుని అవతారమని ప్రజల విశ్వాసం.

• • •

### త్రివేణి సంగమంతో సరితూగే గ్రామం 'సంగం'

కొన్నినదులు కలిసే ప్రదేశానికి 'సంగం' అని పేరుపెట్టారు.

ప్రయాగదగ్గర గంగ యమున, అంతర్వాహిని అయిన సరస్వతి నదులుకలిసే

-కొరవ 11 వ పేజీలో

# కావలి ఎరువుల గోల్మాల్ - సమితిలో సర్పంచ్‌ల గోల!

కావలి సమితిలో జరిగిన ఎరువుల గోల్మాల్‌పై, సర్పంచ్‌లు సమితి సర్వ సభ్య సమావేశంలో గోలచేసిపారేశారు. జనవరి అకాల వర్షాలకు దెబ్బతిన్న చిన్న, సన్నకారు రైతులకు సహాయంగా ప్రభుత్వం సబ్సిడీపై ఎరువులుమంజూరు చేసింది కలెక్టరు ప్రతిసమితికి ఇంతింత అని వీటిని కేటాయించారు.

అయితే, వ్యవసాయ అధికార్లు కావలిలో ఒక్కగ్రామంలోకూడా ఈ ఎరువులు చిన్న రైతులకు పంచలేదట; అధవా పంచినా, ఇస్తాకింత అని మామూలు ముట్టచెప్పనిదే ఇవ్వలేదట. గ్రామాల్లో ఈ పంపకం వ్యవహారం రచ్చరచ్చగా తయారైందట. సమితి సమావేశంలో కొందరు సర్పంచ్‌లు ఈ అంశం ప్రస్తావించారు; పలుప్రశ్నలు వేశారు. అయితే సమావేశంలో వీరికి సమాధానం చెప్పడానికి ఒక్క వ్యవసాయశాఖాధికారికూడా లేరు. సమితిలో జీతాలుతీసుకునే ఇద్దరు డెమాన్‌స్ట్రేటర్లుకూడా అయిపు లేరట. బి. డి. ఒ. కు, ఇతర అధికారులకు ఈ మందలే తెలియదు. దానితో సమావేశంలో గోలరేగిపోయింది.

ఈ విషయంపై సమగ్ర దర్యాప్తు జరపాలని ముంగమూరు సర్పంచ్ శ్రీ పి. శ్రీరాములు కోరారు. వ్యవసాయసిబ్బంది, సాగులేని గ్రామాల్లో సరుకంతా పంచారని, అవసరమైన రైతులకు మాత్రం మొండిచేయి చూపారని పలువురు సర్పంచ్‌లు ఫిర్యాదు చేశారు. ఈ మొత్తం గోల్మాల్ ఉదంతంపై దర్యాప్తు జరపాలని కలెక్టరును కోరుతూ సమావేశంలో ఒక తీర్మానంకూడా చేశారు.

ఈ ఎరువుల గోల్మాల్ ఒక్క కావలి సమితిలోనే కాదు - అన్ని సమితులలో జరిగింది, హెచ్చు, తగ్గులే తేడా. అసలిటువంటి కుంభకోణాలు జరగడం ఇది ప్రథమంకూడాకాదు మూడు నాలుగేళ్ళ నుంచి, ప్రతిఏటా, ప్రతి సమితిలో ఇటువంటి ఆరోపణలు విన్పిస్తూనేవున్నాయి; పత్రికలలో వార్తలు వస్తూనేవున్నాయి. కానీ, ఒక్కసారికూడా అధికారులు వీటిపై చర్య తీసుకున్నట్టుకాని, కనీసం దర్యాప్తు చేసినట్లుకాని మేమెప్పుడూ వినలేదు. ఈ ఆరోపణలన్నీ నిరాధారాలని, వట్టి అభాండాలని అధికారులు భావిస్తున్నారో లేక తమ క్రింది ఉద్యోగులు అన్యాయమైపోతారనే సానుభూతితో దర్యాప్తును. నిజాలను త్రొక్కివేస్తున్నారో తెలియదు.

ఈ ఏడాది జిల్లాకు వచ్చింది మొత్తం 24 లక్షలరూపాయల విలువగల ఎరువులట. సమితివారీపంపకంలో, చాలా కొద్ది మొత్తాలే అందివుంటాయి. అందువల్ల ఈ ఏడాది దుర్వినియోగం అవకాశంకూడా తక్కువే ఇంత చిన్నమొత్తాలపంపిణీపై పెద్ద రాద్ధాంతాలు ఎందుకని భావించి, అధికారులు మౌనంగా వున్నట్టున్నారు. కానీ మొత్తం ఎంత పెద్దదన్నది ప్రశ్న కాదు- అవలీదురలవాటును, ఇంకా చెప్పాలంటే దుర్వ్యసనాన్ని నివారించడానికైనా, తప్పుచేసిన సిబ్బందిని కఠినంగా శిక్షించడం అవసరం.

## జిల్లా వార్తలు

### వాకాడు క్రీడామండలి

వాకాడులోని యువజన క్రీడామండలి ప్రథమ వార్షికోత్సవం 8 తేది జరిగింది; సర్పంచ్ శ్రీ కాటంరెడ్డి రాజారాంరెడ్డి అధ్యక్షించారు. మల్లాం పినాకిని బ్యాంకు మేనేజర్ శ్రీ చంద్రమౌళి, శ్రీ ఎం, వెంకురెడ్డి. క్రీడామండలి గౌరవాధ్యక్షుడు శ్రీ తోపుగుంట సుందరరామిరెడ్డి ప్రసంగించారు.

క్రీడలలో గెలుపొందిన వారికి వాకాడు పినాకిని బ్యాంకు మేనేజర్ శ్రీ ఎస్. ఆర్. వి. రమేష్ బహుమతులు పంచారు. కార్యదర్శి కె, నాగయ్య, కోశాధికారి కె, హెచ్. రామారావు నివేదికలు చదివారు.

### చెన్నూరు కుట్టుకేంద్రం

జిల్లాలోని పలు గ్రామీణ సేవాసంఘాలలో కెల్లా ప్రశంసనీయంగా పనిచేస్తున్న సంఘం- చెన్నూరులోని మిత్రమండలి. వీరి ఆధ్వర్యంలో ఇప్పటికే ఒక గురుకుల పాఠశాల, ఉచిత వైద్య కేంద్రం నడుస్తున్నాయి. ఇప్పుడు కొత్తగా కుట్టు శిక్షణా కేంద్రం తెరిచారు. ఉగాదిరోజు శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి దీనికిరిబ్బను కత్తిరించారు; జిల్లా తెలుగుదేశం కార్యదర్శి శ్రీ డాక్టర్ ప్రభాకర్‌నాయుడు, శ్రీ పోకూరు వెంకటసుబ్బయ్యశ్రేష్ఠి. డాక్టర్ పి. విశ్వమోహనరావు, డాక్టర్ శివయ్య, డాక్టర్ కరీముల్లా, శ్రీ బి. నాగరాజు తదితరులు మాట్లాడారు.

### చిన్నచెరుకూరు స్కూలు

చిన్నచెరుకూరు హైస్కూలు వార్షికోత్సవం ఇటీవల విద్యార్థులే వేడుకగా జరుపుకున్నారు. హెడ్మాస్టరు శ్రీ టి, వి. సుబ్రహ్మణ్యం అధ్యక్షించారు; టీచరు శ్రీ పురుషోత్తమశాస్త్రి బహుమతులు పంచారు. శ్రీ సత్యనారాయణాచార్యులు పంచనాలు చెప్పారు.

తర్వాత పిల్లలు చక్కటి నాటికలు ప్రదర్శించారు.

### వెంకటగిరి స్కూలులో సంచార నేత్ర క్లినిక్

వెంకటగిరిలో కాథలిక్ మిషనరీలు నిర్వహిస్తున్న సెయింట్ ఫ్రాన్సిస్ స్కూలులో, పై ఏడాదినుంచి ఒకసంచార నేత్ర క్లినిక్‌ను ప్రారంభిస్తున్నామని. స్కూలు హెడ్మాస్టరు ప్రకటించారు సాధారణ విద్యార్థులతోటు. అంధులకు కూడా విద్యనేర్పే ప్రత్యేక పాఠశాల ఇది. ఇక్కడ 30 మంది అంధ విద్యార్థులు చదువు నేర్చుకొంటున్నారు ఈ స్కూలు నిర్వహణను పరిశీలించడానికి ఇటీవల థాయిలాండ్‌నుంచికూడా నిపుణులు వచ్చిపోయారట.

స్కూలు వార్షికోత్సవసభలో స్టేట్ బ్యాంక్ మెనేజర్ శ్రీ ఎన్. మోహనరావు డాక్టర్ కె. ఎం. ఎ ఆర్. సిద్దిఖి తదితరులు మాట్లాడారు. ఆటలపోటీలలో గెల్చినవారికి స్టేట్‌బ్యాంక్ బహుమతులిచ్చింది.

—కొరవ 10వ పేజీలో





# గూడూరు పేరును 'దోమలగూడ'గా మారిస్తే?

గూడూరు పేరును 'దోమలగూడ' అనో దోమలవాడ అనో మార్పుచేయడం సముచితంగావుంటుందేమో నంటున్నారు ఆ పట్టణ పౌరులు.

గూడూరులో దోమలు పెరగడంకాదు- ఫ్యాక్టరీలలో సరకులవలె ఉత్పత్తి అవుతున్నాయి. వాటి సైజుకూడా కందిరీగలను తలపింపజేస్తూంది. కుడితే, విపరీతమైన బాధ: కుట్టినమేర బొబ్బలు లేస్తున్నాయి: చర్మం ఊడిపోతూంది. ఫ్యాను ఒకప్రక్క తిరుగుతూనే వుంటుంది: ఇంకొక ప్రక్క వాటికంటే స్పీడుగా దోమలు గాలిలో నాట్యంచేస్తుంటాయి: అవి కుడితే కళ్లనొప్పి ఒకటైతే, చెవుల్లో వాటిసంగీతం ఇంకా పెద్దచికాకు.

రాత్రుళ్ళేకాదు - పగలు పది, పదకొండుగంటలదాకా అవి పౌరులప్రాణాలు తోడేస్తున్నాయి. ఏ ఆఫీసుకైనా వెళ్ళి చూడండి-గుమాస్తాలు కుర్చీల్లో పద్మాసనం వేసుకొని పనిచేస్తుంటారు; కాలు క్రిందపెడితే పాదాలు జివ్వుమనిపిస్తున్నాయి.

దోమల నిర్మూలనకు పేరుకు ప్రత్యేక శాఖవుంది; వారి ఆఫీసు వరకైనా వాటిని నిర్మూలించారో లేదో తెలియదుకాని, టౌనులోమాత్రం వారుచల్లే మందులనుతేనెవలె జుర్రుకుంటున్నాయి దోమలు. పాపం, వారుమాత్రం ఏంచేస్తారు, ఆ మందుల నాణ్యత అంత గొప్పగా వుంటూంది. శ్రీహరికోట ఇదివరకు దోమలకు కేంద్రంగావుండేది. తరతరాల నుంచివున్న ఈ సమస్యను, షార్ కేంద్రం సులభంగా పరిష్కరించింది. గూడూరు మునిసిపల్ అధికార్లు వారితో సంప్రదించి ఈ సమస్యకు ఒక పరిష్కారంచెతకకూడదా? అధికారులు నిర్లక్ష్యం వహిస్తే, బోదకాలు, మలేరియా వంటి ప్రమాదకార వ్యాధులకు గూడూరు నిలయమైపోగలదు, జాగ్రత్త.

## గూడూరు వార్తలు

### రాజయోగ శిబిరం

బ్రహ్మకుమారి ఈశ్వరీయ విద్యాలయం ఆధ్వర్యంలో గూడూరు, కన్యకాపరమేశ్వరి దేవాలయంలో రాజయోగ శిక్షణాశిబిరం జరిగింది. బ్రహ్మకుమారి హృదయ పుష్పాజి దీన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన చిత్ర ప్రదర్శనను శ్రీ పి. దీనదయాళ్ ప్రారంభించారు. కావలి సబార్డినేట్ జడ్జి శ్రీమతి

—కొరవ 10వ పేజీలో

## నెల్లూరు కబుర్లు

### విమర్శకుడు

### జనార్దనరెడ్డి ట్రస్టు

మాజీ విద్యామంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి తలిదండ్రుల పేరిట పేదవిద్యార్థుల సహాయానికి ఒక చిన్న ట్రస్టును ఏర్పాటుచేయ సంకల్పించినట్లు ప్రముఖ న్యాయవాది, ఇందిరాకాంగ్రెస్ లీగల్ సెల్ కన్వీనరు శ్రీ పి. వి. రమణారెడ్డి వ్రాసిన ఒకజాబువల్ల తెలుస్తున్నది.

ఈ సత్కార్యానికి జనార్దనరెడ్డిగారికి ప్రేరణ కల్గించింది రాజ్యసభ సభ్యుడుగా ఆయనకు రావలసిన పెన్షను బకాయి. ఆ మొత్తం సుమారు రూ 50,000 లు వుంటుందట. అది గాక ప్రతినెల రూ 550 లు వస్తుంది. యాభైవేలమీద వడ్డీ ఈ నెలసరి పెన్షను కలిస్తే ప్రస్తుతానికి సంవత్సరానికి పన్నెండువేల రూపాయలవరకు స్కాలర్ షిప్పులు ఇతర రూపంగా పేద విద్యార్థులకు సహాయపడటానికి అవకాశముంటుంది

జనార్దనరెడ్డికి పెన్షను తీసుకోడం ఇష్టం లేక ఇంతకాలం నిల్పివుండినదట కాని ఆమొత్తాన్ని తీసుకొని ఏదైనాసత్కార్యానికి ఎందుకు వుపయోగించకూడదు అనేతలంపు కలిగి ఈ పని చేయబూనుకున్నట్లుంది ఈ నిధి ప్రస్తుతానికి యాభై వేలే అయినా క్రమంగా దానిని పెద్దది చేయాలనే సంకల్పం జనార్దనరెడ్డికున్నట్లు రమణారెడ్డిగారికి వ్రాసిన జాబువల్ల విదితమవుతుంది.

ఈ ట్రస్టు సహాయపరిధి తాను విద్యాభ్యాసంచేసిన వాకాడు ప్రాథమిక పాఠశాలం మొదలు వి. ఆర్ కాలేజి వరకు; మొదటిడిగ్రీతీసుకున్న ఆంధ్రవిశ్వవిద్యాలయం, రెండవడిగ్రీతీసుకున్న శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయం; నెల్లూరు టీచర్స్ ట్రెయినింగ్ కాలేజిమొదలు పెంటపాడు బేసిక్ ఎడ్యుకేషన్ కాలేజివరకు విస్తరించడం జనార్దనరెడ్డిగారి అభిలాషగా వున్నట్లుంది, ఇందులో రేణిగుంట పి ఎం. హైస్కూలుకూడా వుంది.

ఈ ట్రస్టు కార్యకలాపాలను కేవలం పేదవిద్యార్థుల స్కాలర్‌షిప్పులకే పరిమితం గావించ లేదా; విద్య వైజ్ఞానిక సాంఘిక సాంస్కృతిక రంగాలలో ఇతర కార్యక్రమాలకు; డెమొక్రసీ, పార్లమెంటరీ విధానంమీద గోష్ఠులు వగైరాలు నిర్వహించడంవరకు పొడిగించడం జనార్దనరెడ్డి అభిమతమైనట్లు కనబడుతుంది,

దీనికి ఒక ట్రస్టును ఏర్పాటుచేయుట, పేరు నిర్ణయించుట, దానికి నిబంధనలు తయారుచేసి రిజిస్టరు చేయించుట వగైరా తతంగమంతా పెద్దలతో సంప్రతించి సాధ్యమైనంత తొందరగా పూర్తిచేయ వలసిందిగా శ్రీ జనార్దనరెడ్డి రమణారెడ్డి గారిని కోరారు.

ఉన్నతమైన ఆలోచన; వుదాత్తమైన ఆశయం; అభినందనీయమైన కార్యం!

### "అది వార్తకాదా"?

"అది వార్తకాదా? దాన్ని ప్రకటించరేం?"

"ఏమిటావార్త? మాకు తెలియదే!"

"తెలియకపోవడమేమిటి, కోట-కోవూరు మధ్య ప్రదేశంలో అంతా కథలు కథలుగా చెప్పుకుంటుంటేనూ!'

"...దా? విన్నాము కాని అది వ్యక్తిగత విషయం; అది ఆ మంత్రిగారి స్వంత సంగతి. ప్రకటించదగిందకాదు."

"మంత్రి అంటారు; ప్రకటించతగింది కాదంటారు. ఏమిటది? ప్రజాసేవారంగంలోవుండే ముఖ్యులు చేసే పనికి వ్యక్తిగతమని, పబ్లిక్ అనివుండవు, వుండకూడదు. అన్నీ బహిరంగమే. అలాంటప్పుడు మీరు వ్యక్తిగతమని ఆవార్త ఇవ్వకుండవలసిన అవసరంలేదు. ఇప్పటికైనా ప్రకటించండి!"

"ఏమైనా మా అభిప్రాయంలో అది వ్యక్తిగతమైనదే. ప్రకటనార్హమైన వార్త కాదు"

"ఈ సూత్రాన్ని ఆ మంత్రిగారు తన జన్మలో ఎప్పుడైనా గ్రహించారా? అనుసరించారా? అయినదానికి కాని దానికి సభ్యతాసంస్కారాలు, వున్నత ప్రమాణాలను విస్మరించి గిట్టనివారిమీద పిటిషన్లుపెట్టడం, ప్రకటనలు చేయడమే ప్రజాసేవగా అనుష్ఠించలేదా?అంతేకాదు; ప్రజాసేవలో తన ఆస్తి అంతా కర్పూరంలా కరిగిపోయిందని ఆయన ప్రకటించుకున్న విషయం మీకు గుర్తులేదా? అటువంటి స్వార్థత్యాగికి ఇప్పుడు ఈ ఆడంబరాలకు, ఆస్తి సంపాదనకు శక్తి ఎక్కడిది? ఇదైనా నిలదీసి అడగవలసిన విషయం కాదంటారా?"

"మేము దిగజారలేము. ఆయనవలె శ్రీరంగనీతులు చెప్పలేము; కర్కశంగా వ్యవహరించలేము. క్షమించండి! సెలవు!"

### క్రాస్ ఓటింగులో మరో ఎం. ఎల్. ఎ.?

రాజ్యసభ ఎన్నిక క్రాస్ ఓటింగులో నెల్లూరుజిల్లాకు చెందిన మరో కాంగ్రెస్ ఎం. ఎల్. ఎ. కూడా వుండవచ్చునని హైదరాబాదు పి సి సి వర్గాలలో వదంతులు.

ఎవరాకాననసభ్యుడు? ఏమిటాకథ? మీకేమైనా తెలుసా?

### అధికార వర్గం

సోమశిల ప్రాజెక్టు సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ సుందరరాజు రిటైరయ్యారు. ఆయన స్థానంలో శ్రీ నారాయణరాజు ఛార్జి తీసుకున్నారు.

• • •

ఆర్ అండ్ బి శాఖలోకూడా పెద్ద ఎత్తున మార్పులు జరిగాయి. నెల్లూరు ఎగ్జిక్యూటివింజనీరు శ్రీ ఎం. పాండురంగరావు, హైదరాబాదు వ్యవసాయ విశ్వవిద్యాలయానికి బదలీ అయినారు; ఆయన స్థానంలో ప్రమోషన్‌పై శ్రీ కె. నారాయణరెడ్డిని నియమించారు.

ఇన్వెస్టిగేషన్ ఇ. ఇ. శ్రీ మహమ్మద్ గౌస్‌మొహిద్దీన్‌ను విశాఖపట్నానికిపంపి, ఇక్కడ శ్రీ ఎస్. బుడగారావును నియమించారు.

### కాలేజి ఫీజులు- వి.ఆర్. కాలేజి విడ్డూరం!

కామ పీడితమైన ప్రాంతంలో కాలేజిల మూడవటరం ఫీజు. హైస్కూళ్ళ- కాలేజి పబ్లిక్ పరీక్షల రుసుము రద్దు చేసింది ప్రభుత్వం. ఆ వుత్తరువును వి. ఆర్. కాలేజి, దాని తోకయైన వేణుగోపాలస్వామి కాలేజిలుమాత్రం అమలు జరపలేదు: నిలబెట్టి ఫీజులన్నీ వసూలు చేశాయట. డి. కె. డబ్ల్యు. కాలేజి వంటివి అమలు జరిపాయి.

ఉత్తరువులో స్పష్టంగా వున్నప్పుడు వి. ఆర్. కాలేజి మాత్రం ప్రభుత్వం కల్పించిన సహాయాన్ని విద్యార్థులకు అందనివ్వలేకపోవడంవిడ్డూరంకాదు; విచారకరం. బహుశా ఆదిశేషారెడ్డిగారు ఆ వుత్తరువులో న్యాయశాస్త్ర సంబంధమైన లొసుగునేదైనా వెతికిపట్టుకొని, ఫీజులు రద్దుచేయవలసిన అవసరంలేదని సలహా ఇచ్చివుంటారేమో!

### రామాయణ ప్రశస్తి

వర్ధమాన సమాజాధ్వర్యంలో 19 తేది సాయంత్రం టౌనుహాలులో 'రామాయణ ప్రశస్తి' జరుగుతుంది; ప్రొద్దుటూరు, శ్రీ ఎస్. రాజన్నకవి "రామకథలో మానవత"పై ప్రసంగిస్తారు.

### సైకిల్ యాత్ర

ఇళ్ళులేని పేదలకు ఇళ్లనిర్మాణానికి సహాయం చేయడంకోసం, బెంగుళూరు నుంచి సైకిల్‌పై దేశయాత్రచేస్తున్న ఏడుగురు యువకుల బృందం 11 తేది నెల్లూరుచేరింది. వారికి జేసిస్‌క్లబ్ అధ్యక్షుడు శ్రీ గోరంట్ల రాధాకృష్ణ వసతి సౌకర్యం కల్పించారు. సాయంత్రం కెనరాబ్యాంకులో చిన్నసభ - బ్యాంకు అగ్రికల్చరల్ మేనేజర్ శ్రీ రామకృష్ణ స్వాగతించారు; సైకిల్ యాత్రికులు తమ అనుభవాలు చెప్పారు; శ్రీ జి. రాధాకృష్ణ వారికి ధనసేకరణాది హామీలు ఇచ్చారు.

### మరణాలు

పంచాయతీరాజ్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా మొదట నెల్లూరులోవుండి, తర్వాత గూడూరులో పనిచేస్తుండిన శ్రీ కె. వెంకటేశ్వర్లు (55) 6 తేది వుదయం గుండెపోటుతో గూడూరులో హఠాత్తుగా మరణించారు. ఆయనకు భార్య, ఇద్దరు కుమా

—కొరవ 7వ పేజీలో

## చంద్రబాబు (మొదటి పేజీ తరువాయి)

పించి రహస్యపత్రికలైనాఫుంటే వాటిని ఇతరపార్టీలు విరోధించాలి; అధికార్లూ తిరస్కరించాలి!

* * *

చంద్రబాబునాయుడుగారి నెల్లూరు రాకకు మరొక ప్రత్యేక కారణమున్నదని పుకారు. జిల్లా తెలుగుదేశంలో ఇప్పటివరకు రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిదే రాజ్యం. ఇటీవల శాసనసభ్యుడు శ్రీ ఆనం రామనారాయణరెడ్డి అతని ప్రత్యర్థిగా ముందుకు వస్తున్నారు. పార్టీలోకాని, పార్టీ శాసన సభ్యులలోకాని ఎంతవరకు బలం సంపాదించుకో గలిగారో తెలియదుగాని. రామనారాయణరెడ్డి ముఖ్యమంత్రి రామారావు; సూపర్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగార్ల దృష్టి నాకర్షించడానికి, వారి సానుభూతిని పొందడానికి ప్రయత్నిస్తున్నాడనే విషయం పాఠకులకు తెలుసు. రామనారాయణరెడ్డికి మంత్రిత్వమో, లేక దానికి సమానమైన మరో పదవో రావచ్చుననే వదంతులు వున్నాయనే విషయంకూడా పాఠకులకు తెలుసు.

చంద్రబాబునాయుడుగారు నెల్లూరుకు వచ్చినపుడు తన మామూలు కార్యక్రమాలకు హాజరుకావడమేకాకుండా, జిల్లాలోని తెలుగుదేశంలో శ్రీనివాసులురెడ్డి-రామనారాయణరెడ్డిగారల బలాబలాలను, వారిపేరు ప్రతిష్టలను అంచనా వేయవచ్చునని అంటున్నారు. ఇది ఎంతవరకు నిజమో ధృవపడందే చెప్పలేము.

(రవ పేజీ తరువాయి)

దులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

వెంకటేశ్వర్లురురుకుదనం మంచితనం సమర్థత మేళవించిన అధికారి.

* * *

నెల్లూరు మూలపేట శ్రీ అన్నదేవుల గోపాలకృష్ణారెడ్డి సతీమణి; ఆటోమొబైల్ డిప్లొమాపొంది, వర్కుషాప్ నిర్వహిస్తూ-ఆ రంగంలో అరుదైన నీతి నిజాయితీలు కలిగి వుందాగావుండే శ్రీ ఎ. సుధాకరరెడ్డి తల్లి పవనమ్మ (54) గత 27 తేది దివంగతురాలైంది.

* * *

తోటపల్లిగూడూరు మండల సర్వేయర్ శ్రీ యస్. నరసరాజు (52) 13 తేది నెల్లూరులో హృద్రోగంతో మరణించాడు. ఆయనకు భార్య, ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె వున్నారు.

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు (9672) (పుట్టి) | 1400-00 |
| బి. ఆర్. 20 | 1350-00 |
| పెసలు కూము | 221-00 |
| పిల్లిపెసలు .. | 155-00 |
| మినుములు .. | 220-00 |
| ఉలవలు 100 కి. | 225-00 |
| వేరుసెనగ 10 కి. | 42-50 |

పెసలు, మినుములు తైవాను. చైనాల నుండి దిగుమతిఅవుతున్నాయట. అందువల్ల మనకు ధర పడిపోయిందట. మన రైతు అన్నివిధాల దరిద్రుడేగదా!



### సవరణ

'జమీన్‌రైతు' 4-4-86 తేది వెలువడిన వారపత్రిక 15 పేజీలోని అడ్వొకేట్ వై. జానకిరామయ్యగారి కోవూరు సబార్డినేట్ జడ్జి కోర్టు వారి ప్రకటనలో ఐ. పి. నంబర్ 36/86 గా చదువుకో వాల్సిందిగా కోరుతున్నాము.

—వై. జానకిరామయ్య, అడ్వొకేట్



### కరటంపాడు గ్రామపంచాయతి
### —టెండరు నోటీసు—

కరటంపాడు గ్రామపంచాయతీకి 1986-87 సంవత్సరమునకు 1) 40 వాట్సు ట్యూబులైట్లు 4 అడుగులవి కాపర్ చోక్ ఫ్రేమ్‌తోటి, 2) 40 వాట్సు 4 అ, ట్యూబులు 3) 40వాట్సు స్ట్రాంబల్బులు. 4) చోకులు, 5) స్టార్టర్లు 6) లాక్ అండ్ హోల్డర్సు, 7) స్ట్రాం హోల్డర్సు 8) వైరు వగయిరా సామానులు దఫాలవారీగా సప్లయిచేయుటకు ఆథరైజ్డ్ డీలర్లనుండి సీలువేయబడిన టెండర్లు తే 25-4-86 ది శుక్రవారం మధ్యాహ్నం 3 గంటలకు కరటంపాడు పంచాయతి కార్యాలయంవద్ద సర్పంచ్ గారిచే గాని లేక వారి అనుమతిపొందిన వారిచే గాని తీసుకొనబడుమ. టెండరు వేయదలచువారు రూ 50/- లు ధరావత్తు చెల్లించవలయును: టెండర్లు అదేరోజున మధ్యాహ్నం 3-30 గంటలకు హాజరయిన టెండరుదార్ల సమక్షమున పరిశీలించబడును, ఇతర వివరములు పంచాయతీ కార్యాలయంలో తెల్పుకొనండి.

-వేమన పాపయ్యనాయుడు. సర్పంచ్

మద్రాసు స్మాల్ కాజస్ కోర్టులో
U. C. S. C. No. 2021/84

ఎ. రాధాకృష్ణ —వాది.
పిగిలి సుబ్బమ్మ మరియు ఇతరులు —ప్రతివాదులు.

To

1. పిగిలి సుబ్బమ్మ W/o పిగిలి కొండయ్య. నరసింగోలు: 2. గండు పెద్ద కొండయ్య గడ్డూరు. 3. గండు చిన్న కొండయ్య. నరసింగోలు అనువారికి-

ఇందువలన ప్రతివాదులకు తెలియ చేయడమేమనగా వారికి మీవలన రావలసిన మొత్తము రు. 1693/- మరియు ఖర్చులు రాబట్టుకొనుటకు order 37 Rule 2 of S. C. Rules ప్రకారం 3 వ స్మాల్ కాజస్ కోర్టు, మద్రాసు నందు 28-4-86 తేది ఉ. 10-30 గంటలకు ఫ్రాయిదా వేయబడినది ఆరోజు మీరు హైకోర్టులో మీ ఆక్షేపణలు తెలుపుకోవలెను. లేనియెడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

-టి. నృందకుమార్
వాది తరఫు అడ్వకేటు.



### టెండరు ప్రకటన

ఇందుకూరుపేట పంచాయతి సమితి, నారాయణరెడ్డిపేట గ్రామపంచాయితీకి కావలసిన వీధిదీపములు 1) 4 అడుగుల ట్యూబులైటు సెట్లు ఫిక్సర్సు (కాపర్ చోక్సు) కండెన్సరు పైపు వగైరాలు 20, ఇరవై సెట్లు. క్రాంప్టన్, మైసూర్, బజాజ్ సిల్వేనియా ఒరిజినల్ సెట్లు. 2) ఎం. వి. ల్యాంపు సెట్లు 250 w 4 (నాల్గు) క్రాంప్టన్, మైసూర్, బజాజ్, సిల్వేనియ (సోడియం పేపర్ ల్యాంప్సు ఫిలిప్సు కంపెని) సైపు క్లాంప్సు వగైరా (ఒరిజినల్ సెట్లు) సంఘరాచేయుటకు టెండర్లు తే 30-4-86 దిన మధ్యాహ్నం 12 గంటలవరకు తీసుకొనబడును. అదేరోజు 12-30 గంటలకు హాజరైన టెండరు దారుల సమక్షములో తెరువబడును.

—ధరావత్తులు—

1) ట్యూబులైట్లు : రూ 100.00
2) యం. వి. ల్యాంపులు :
సోడియం వేపర్‌ల్యాంప్సు 100-00

మిగతా వివరములు ఆఫీసు పనిచేయు వేళలలో తెలిసికొనవచ్చును.

పముజుల సుబ్బారావు
సర్పంచ్-నారాయణరెడ్డిపేట

### ●● నిర్యాణము



15-8-1929 10-4-1986

నా సతీమణి
బెల్లంకొండ శేషాంబ
ఉగాది పర్వదినాన మమ్ము దుఃఖ సాగరమున ముంచి స్వర్గస్తురాలైనది.
ఆమె ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తూ-

భర్త
బెల్లంకొండ లక్ష్మీనారాయణరావు

చెల్లెళ్ళు, కూతుళ్లు అల్లుళ్ళు మనుమలు, మనుమరాళ్లు రవి, గిరి.

## జిప్‌బ్యాగ్ పోయినది

15-4 86 తేది ఉదయం వెంకటగిరి నుండి గూడూరు వచ్చు ఆర్.టి.సి బస్‌లో నా జిప్‌బ్యాగ్ (మెరూన్ కలర్) మరచిపోయాను అందులో మా స్కూలు కాగితాలు రు 300/ రొఖము ఉన్నవి. ఎవరికైనా దొరికిన నాకు చేర్చిన తగు బహుమతి ఇవ్వబడును.

ఇ. జయలక్ష్మి
హెడ్ మిస్ట్రెస్
C/o. సూర్యనారాయణ
కెమిస్ట్రీ లెక్చరర్
రంగమ్మవీధి. వెంకటగిరి

## ప్రకటన

నా పేరుతో మాళవ్యానగర్ పడమటి గూడూరు గూడూరు టౌన్ కాపురస్థుడు తాటిపర్తి వెంకటశేషయ్య 9-8-84 తేదిన వార్డు నం. 1 డోరు నం. 568 గల ఇంటిలో ఒకభాగం రూ.45000/- లకు విక్రయించి రిజిష్టరు విక్రయ దస్తావేజు వ్రాసి యిచ్చినారు. అదేవిధముగా నా భార్య అయిన దగ్గుమర్తి ధనలక్ష్మి పేర 12-6-85 తేది అదే యింటిలో మరియొక భాగమును రూ. 45 000/ లకు ఆయన విక్రయించి విక్రయ దస్తావేజు వ్రాసి యిచ్చినారు. సుమారు ఒకమాసము క్రితం సదరు అసలు పత్రములకు జెరాక్సు తీసుకొని వచ్చుటలో అసలు పత్రములను గూడూరులో పోగొట్టుకొనినాను ఆ పత్రములు ఎవరికైనా దొరికినయెడల నాకు చేర్చవలసినదిగా కోరుచున్నాను. అందుకు తగిన పారితోషికము ఇవ్వగలవాడను.

దగ్గుమర్తి సుబ్రహ్మణ్యం
S/o. లక్ష్మీపతి
తిక్కవరం (పోస్టు) చిల్లకూరు మండలం
నెల్లూరు జిల్లా

## ఆంధ్రాబ్యాంకు

కోవూరు-నెల్లూరుజిల్లా.

ఈ దిగువ తెలిపినవారు మా బ్యాంకులో బంగారు నగలు కుదువ వుంచి విడిపించుకొననందున మా బ్యాంకు ఆవరణలో 26-4-86 తేది శనివారం మధ్యాహ్నం 1 గంటకు బహిరంగ వేలం వేయబడును వేలం తేదిని ఎట్టి నోటీసు లేకనే వాయిదా వేయుటకు వేలం ఆపుటకు బ్యాంకు వారికి అధికారం కలదు. వేలం వలన కలుగు కష్టనష్టములకు బ్యాంకువారు జవాబుదారీకారు ఇతర వివరములు బ్యాంకు పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

| వ.నం. | లోన్ నం. | పేరు మరియు చిరునామా | నికర తూకం గ్రా. |
|---|---|---|---|
| 1 | 7/39 | షేక్ నజీర్ అహ్మద్ S/o. హసన్ సాహెబ్ కోవూరు | 58 |
| 2 | 9/56 | ప్రభలపేట సుబ్బమ్మ W/o. సుబ్బయ్య కోవూరు | 7 |
| 3 | 9/84 | కాసుమాని జయలక్ష్మమ్మ W/o. పెంచలయ్య వేగూరు ఖండ్రిగ కోవూరుతాలూకా. | 19 |
| 4 | 9/89 | మరుపూరు లక్ష్మీనర్సారెడ్డి S/o. వెంకటసుబ్బారెడ్డి మోడేగుంట, కోవూరు తాలూకా | 20 |

బ్రాంచి మేనేజర్

ఇందుకూరుపేట బిట్ 2 గ్రామపంచాయితీ కార్యాలయము
కొత్తూరు

ఆర్.ఒ.సి. నం. 49 — తేది 16-4-86

## టెండరు ప్రకటన

1986 87 సం॥నకు ఇందుకూరుపేట బిట్ 2 (కొత్తూరు) గ్రామ పంచాయితీకి ఈ దిగువ తెల్పిన ప్రకారము వస్తువులు సరఫరా చేయుటకు మరియు అంశము నం. 2 నందు కనపరచిన పనులను చేయుటకు తేది 29-4-86 మంగళవారం సాయంత్రము 4 గం॥వరకు గ్రామపంచాయితీ కార్యాలయమువద్ద సీల్డు టెండర్లు తీసుకొనబడి అదేరోజు సాయంత్రము 4-30 గంటలకు హాజరయిన టెండరుదారుల సమక్షములో సీల్డు టెండర్లు తెరువబడును. ఆ ప్రకారము టెండర్లు దాఖలు చేయువారు అయా అంశములకు ఎదురుగా చూపబడిన మొత్తములను ధరావత్తుగా చెల్లించవలయును.

| అంశము 1 | ధరావత్తు మొత్తం |
|---|---|
| ఎ. 1986-87 సం॥ నకు వీధి విద్యుద్దీప పరికరములు మరియు 4' ట్యూబులైట్ల ఫిక్చర్లు ఎం. వి. ల్యాంపుల సెట్లు వగైరా సరఫరా చేయుటకు | రు. 50/- |
| బి. 1986-87 సం॥నకు హాండుపంపుల విడిభాగములు హాండుపంపులు జి.ఐ.పైపులు వగైరా సరఫరాచేయుట | 25/- |
| సి. 1986 87 సం॥నకు ప్రజారోగ్య సిబ్బందికి బెన్నీ కాకీ దుస్తులు తలపాగాలు వగైరా సరఫరాచేయుట | 5/- |
| డి. ప్రజారోగ్య నిర్వహణకు అవసరమగు సున్నము. ఫినాయిలు, బ్లీచింగ్‌పౌడరు, చీపుర్లు. వెదురు బుట్టలు, పారలు గడ్డపారలు సప్లయి చేయుట | 5/- |
| ఇ. 1986-87 సం॥నకు స్టేషనరీ సామాన్లు సప్లయి చేయుట | 10/- |

అంశము 2

| పని పేరు | ఎస్టిమేటు విలువ | ధరావత్తు |
|---|---|---|
| 1. పంచాయితీ నిర్వహించు పార్కునందు రచ్చ అరుగు నిర్మాణము | 2800/- | 70/- |
| 2. బుడంవారి ఖండ్రిగలో రేడియో రూము నిర్మాణము | 10000/- | 250/- |

గమనిక :- 1 (ఎ); 1 (బి) లకు వస్తువులు సరఫరా చేయువారు అథరైజ్డ్ ఏజెన్సీదారులయి వుండి అందుకు సంబంధించి సర్టిఫికేటు జెరాక్సు కాపీలు జతపరచవలెను.

అ. శేషబ్రహ్మేంద్రరావు
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

## నామాట

(4 పేజి కొ.వ)

గంలోకి తొంగిచూచే సావకాశం చిక్కితే-భూలోకస్వర్గం సాక్షాత్కరిస్తుంది. ఎసిలు, ఫ్రిజ్‌లు, వీడియోలు. కలర్ టివిలు లేని ఇళ్ళు లేవంటే మనమాశ్చర్యపోతాం. మరి కొందరిళ్ళలో మీటనొక్కితే తెరచుకునే తలుపులు, పరుచుకునే పరుపులు కూడా వున్నాయట. వాటినిచూచి తరించే భాగ్యం నాకు కల్గలేదు కాబట్టి; నేనునమ్మలేదనుకోండి! మండపాలవీధిలో అంకణం స్థలమెంతో తెలుసా? ముప్పయ్‌వేలు!

ఎక్కడో ఉత్తరభారతంనుంచి పంచ గుడ్డ పైనవేసుకునివచ్చిన వీరు ఇంత స్వల్పవ్యవధిలో ఇంతింత కుబేరులెట్లా అయ్యారు? వీరి సంపాదనకు మార్గాలెక్కడివి? స్మగ్లింగ్ విచ్చలవిడిగా ఇక్కడ జరుగుతుందని టౌనంతా గగ్గోలుగావుంటే పోలీసులు, ఇతర అధికారులు కళ్ళు మూసుకుని ఎందుకు వున్నారు? రోడ్డుప్రక్కన పావలాకు, అర్థరూపాయకు నకిలీ ఇంపోర్టెడ్ వస్తువులమ్ముకునే సన్నగాళ్ళపై విరుచుకపడతారే-వీరిజోలికెందుకుపోరు?

మండపాలవీధి వ్యాపారస్తులకు-పోలీసులకుమధ్యవున్న అనేకానేక ఒప్పందాలు, బయటనుంచి ఇక్కడకు, ఇక్కడనుంచి బయటకు జరిగే రకరకాల వ్యాపారవిధానాలు....తదితరాలపైకూడా ఎన్నోకథలు విన్పిస్తుంటాయి. వాటన్నింటిని మరొకసారి ముచ్చటించుకుందాం,

* * *

తన ప్రజ్ఞతో వివిధ దేశాలనుంచి పోటాపోటీలుగా ఉద్యోగాహ్వానాలు అందుకుంటున్నందుకు గర్వించాలో, లేక తన ప్రతిభకు గుర్తింపు లేదనే నిస్పృహతో దేశం వదలివెళ్తున్నందుకు చింతించాలో నాకు తెలియదుకాని- డాక్టర్ జగదీశ్ అతిత్వరలో నెల్లూరు విడిచి వెళ్ళిపోతున్నాడు. ప్రత్యామ్నాయ ఇంధన వనరుల శాస్త్రంలో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన జగదీశ్ పుట్టినింట్లో, పుట్టిన దేశంలో అనామకుడుగా బ్రతకలేక, నిశ్శబ్దంగా విమానమెక్కబోతున్నాడు.

తమదేశంలో ప్రత్యామ్నాయ ఇంధన వనరులను అభివృద్ధి పరిచేందుకు ప్రణాళికలు రూపొందించమని, జాతీయసలహాదారుడుగా వుండమని 'ఒమెన్' దేశ ప్రభుత్వం ఆయనకు ఆహ్వానం పంపింది; మనీలాలో, యు.ఎస్.ఎ.లో, ఇతర దేశాలలో ఆయనకున్న సహచర, మిత్ర శాస్త్రవేత్తలు, పలు పరిశోధక సంస్థలు. ఆయన్ను తమ దగ్గరకురమ్మని పదేపదే పిలుస్తున్నారు.

నాలుగేళ్ళ క్రితమే డాక్టర్ జగదీశ్‌కు ఇటువంటి 'ఆఫర్స్' అందాయట. అయితే అప్పట్లో ఆయనకు దేశం వదలి వెళ్ళాలనే తలంపే లేదు. తన శాస్త్రపరిశోధన, వాటి ఫలితాల ప్రయోగం ఇక్కడే జరపాలనే కృతాభిప్రాయంతో వుండేవారు. కానీ ఈ నాలుగేళ్ళ అనుభవం తనకెన్నో జీవితపాఠాలు నేర్పిందంటారు- జగదీశ్ ఆయన పరిశోధనలు ప్రభుత్వం గుర్తించకపోతే పోయింది. -కనీసం ఆయన పనిచేస్తున్న వి.ఆర్ కాలేజికూడా ఆయన్ని పట్టించుకున్న పాపాన పోలేదు. ఇన్నిసార్లు ప్రపంచ పర్యటనలుచేస్తే కనీసం ఒక్కటంటే ఒక్కసారి కాలేజి తరపున ప్రోత్సాహం ఇవ్వటంకాని, అధమపక్షం ఒక మీటింగు సభ పెట్టి గౌరవించటంకాని చేయలేకపోయింది. ఇటువంటి దౌర్భాగ్యపరిస్థితులలో ఇక్కడుండి ఏమి చేయాలన్నది, ఎవరైనా ప్రశ్నిస్తారా?

జగదీశ్ మే నెలలో జరగబోయే అంతర్జాతీయ ప్రత్యామ్నాయ ఇంధన వనరుల సదస్సుకు అధ్యక్షతవహించేది, అరుదైన గౌరవం అందుకోను స్వీడన్ వెళ్తున్నాడు అక్కడినుంచి తిరిగివచ్చే సమయంలో బహరైన్, మనీలావంటి నగరాలలోని తన మిత్రులు, తనకు ఉద్యోగాహ్వానం ఇచ్చిన సంస్థలతో సంప్రదించి, ఏది తనకు అనుకూలమో నిర్ణయించుకుని, ఒకటి రెండు నెల్లోనే దేశం వదలి వెళ్లాలనే తలంపుతో వున్నాడు జగదీశ్.

"బ్రెయిన్ డ్రెయిన్" గురించి వేదికలెక్కి గొంతు చించుకునే నాయకులకు ఇటువంటి సంఘటనలు మనసుకెక్కవా?

★

## పినాకినీ తీరం

(2వ పేజి కొరవ)

సంతృప్తితో ఇంటికి తిరిగిపోతామని ప్రాధేయపడ్డారట: కాని అయ్యగారికి తీరికలేదు, మీకు దర్శనం ప్రాప్తంలేదు అని భటులు చెప్పారట. ఆశాభంగానికి తమనుతాము తిట్టుకుంటూ వీరంతా ఇంటిదారి పట్టారట. ఆ రైల్వేపుద్యోగి ప్రక్కవారితోనిర్వేదంతో చెప్పినమాటలసారాంశం ఇదీ!

దీన్నిబట్టి హాజీ మస్తాన్‌కుకూడా దేశవ్యాప్తంగా అజ్ఞాతభక్తులు కొందరున్నారని నిర్ధారణవుతుంది. అటువంటి హాజీ మస్తాన్ స్వంతంగా ఒకపార్టీ పెట్టడంలో, దాని ఆంధ్రశాఖకు ప్రారంభోత్సవం జరపడంలో ఆశ్చర్యమేముంది? ఢిల్లీ తిహార్ జైలు నుండి పట్టపగలు తప్పించుకొనిపోయి, అతనికోసం పోలిస్ వేటాడుతుండినసమయంలో చార్లెస్ శోభరాజ్‌ను ప్రేమిస్తున్నానంటూ మనకు కథలు వినిపించిన వైశాలిరెడ్డివంటి విచిత్ర వ్యక్తులున్నదేశం మనది అనుకున్నపుడు హాజీమస్తాన్ పార్టీ పెట్టడం వింత కావడానికి వీల్లేదుగదా!

నసా

## సందేశం

### చంద్రగ్రహణం

24-4-86 తేది చైత్ర శుక్ల పూర్ణిమ గురువారం సాయంత్రం 4-33 గంటలకు చంద్రగ్రహణము పట్టును. రాత్రి 7-52 గంటలకు గ్రహణం విడుచును. కేతుగ్రస్త సోమోపరాగము గ్రస్తోదయ గ్రహణము.

### ముహూర్తములు

ఏప్రెల్ 30, మె 1, 2 తేదులలో వివాహములు మరియు గృహవాస్తు శుభ కార్యములు ఆచరింపవచ్చును.

### ఏప్రెల్ తిథులు

19 శని దశమి రా. 12-41 గం. వ.
20 ఆది ఏకాదశి రా. 12-32 గం.వ.
21 సోమ ద్వాదశి రా. 11-27 గం వ
22 మంగళ త్రయోదశి రా. 9-59 గం
23 బుధ చతుర్దశి రా. 8-24 గం. వ.
24 గురు పూర్ణిమ సా. 6-27 గం వ.
25 శుక్ర బహుళ పాడ్యమి సా. 4-08 గం. వ.

—సిమ్మగడ్డ వెంకటేశ్వరశాస్త్రి

# ముఖ్యమంత్రి కళ్లు ఇప్పుడు తెరిపినబడ్డాయి!

నంది అవార్డులను తెలుగు చిత్రాలను అర్పించడం లో ఒ ప్రభుత్వం ఈ ఏడాది ఘోరంగా విఫలమైంది. మొత్తం తెలుగుపరిశ్రమే ఈ అవార్డులను బహిష్కరించిందా అన్నంత నిస్సారంగా, నిర్లక్ష్యంగా జరిగింది అవార్డుల ప్రదానోత్సవం. పోటీకి ఏదేచిత్రాలు ఎందుకు వచ్చాయి అన్నప్రశ్న సర్వత్రా వినిపిస్తూంది. పై పెచ్చు, అవార్డులక్రింద బహూకరించిన నంది విగ్రహాలు 'మంచెలుకల' సైజులో వుండడాన్ని కొందరు ప్రముఖులు అక్కడే ఎత్తిచూపి, ప్రభుత్వాన్ని అవహేళనం చేశారు.

ఈ సంఘటనలు ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు కళ్ళుతెరిపించినట్లున్నాయి. ఆయన,పరిస్థితిగమనించి, మరీ పరువు పోయేటట్లుందనుకున్నారు కాబోలు-అక్కడికక్కడే, అసభలోనే పరిశ్రమకు కొన్ని రాయితీలు ప్రకటించారు. ఇకనుంచి రాష్ట్రంలో నిర్మితమయ్యే

## పరిశ్రమకు రాయితీలు

ప్రతిచిత్రానికి లక్షరూపాయల సబ్సిడీతో పాటు, అచిత్రం తయారైన తెలుగు స్టూడియోలకుకూడా లక్షరూపాయల బహుమానం యిస్తారు. రాష్ట్ర, జాతీయ అవార్డులుపొందిన, రాష్ట్రంలో తయారైన ప్రతి చిత్రానికి వినోదపు పన్ను మినహాయిస్తారు. సెన్సార్ సర్టిఫికేట్ పొంది, ఐదేళ్ళు ప్రదర్శింపబడిన ప్రతి చిత్రానికి. అతిం్యత వినోదపుపన్నులో 20 శాతం రాయితీ వుంటుంది.

ముఖ్యమంత్రి ప్రకటించిన ఈ రాయితీలు పరిశ్రమకు ఉపయుక్తమే: కాని, ఇదివరకేవున్న లక్ష సబ్సిడీ పథకం క్రింద నిర్మాతలకు డబ్బు చేతికందడం లేదని గగ్గోలుగావుంది. ఏళ్ళ తరబడి కార్యాలయాలచుట్టూ తిరగలేక, కొందరు నిర్మాతలు ఆ డబ్బుకు నీళ్లొదిలేస్తున్నారు కూడా. ఇప్పుడు ప్రకటించిన ప్రోత్సాహకాలకూ అదే గతి పట్టకుండా చూస్తేనే, రాష్ట్రంవైపు నిర్మాతలు ఆకర్షితులౌతారు; లేకుంటే యథాస్థితే!

# పోటీకి ఎక్కువ చిత్రాలే వచ్చివుంటే...?

మురళీమోహన్ సమర్పించిన "ఓ తండ్రితీర్పు"కు ఉత్తమచిత్రం అవార్డు, ఆయనకు ఉత్తమ నటుడి అవార్డు వచ్చాయి. ఉగాదినాడు రాష్ట్రప్రభుత్వ అవార్డులను అందుకున్న తరువాత ఆయన ఆనందోద్రేకంతో "ఈదఫా నంది అవార్డులకోసం చాలా తక్కువ చిత్రాలేవచ్చాయి. పోటీకి నిలబడలేవనే భయంతో ఎక్కువమంది నిర్మాతలు తమ చిత్రాలను పంపివుండకపోవచ్చు" అనడం ఒక నిర్మాతకు బాధకలిగించింది. దానికి మరో హీరో- "పోటీకి ఎక్కువమంది నిర్మాతలు చిత్రాలను పంపివుంటే, అసలు ఈయన చిత్రానికి ఉత్తమచిత్రంగా, ఈయనకు ఉత్తమ నటుడిగా బహుమతులువచ్చివుండేవా?" అనడంతో ..క్కడున్నవాళ్ళంతా గొల్లున నవ్వారు.

### రాజకీయ రంగంనుంచి సినిమా రంగానికి

సినిమారంగంనుంచి కొందరు రాజకీయ రంగంలోకి వెళ్తూంటే, రాజకీయ రంగంనుంచి సినిమారంగంలోకి ప్రవేశించారు చల్లా రామకృష్ణారెడ్డి. ఈయన వ్యవసాయ రంగంలో 'కృషిపండిట్' కూడా. ఈయన హీరోగా జంధ్యాల దర్శకత్వంలో "సత్యాగ్రహం" అనే చిత్రం షూటింగ్ గుంటూరు దగ్గరున్న అమీనాబాద్ లో ఏప్రెల్ 10 వ ప్రారంభమైంది. మాటలు : జంధ్యాల, పాటలు: వేటూరి. కెమెరా : ఎస్. గోపాల్ రెడ్డి. నిర్మాత : విజయ్ అమర్‌నాథ్ రెడ్డి, బి. ఎ., బి. ఎల్.

### వార్తల్లో శబ్నా ఆజ్మీ

ప్రధానమంత్రి వుద్దేశించిన ముస్లిం బిల్లుజారీఅయితే,విడాకులుపొందినముస్లిం మహిళలకుఎదురయ్యేఇక్కట్లదృష్ట్యా తన నిరసనను తెలియజేసిన హిందీనటి శబ్నా

**మా మద్రాసు సినీ ప్రతినిధి**

ఆజ్మీ, బొంబాయి సంజయ్‌గాంధీ నగర్ లోని గుడిసెవాసులకుమద్దతుగా ఒకప్రదర్శన నిర్వహించిన సందర్భంగా స్వచ్ఛందంగా అరెస్ట్ అయింది. వెంటనే విడుదలయిందికూడా. కొంపతీసి ఈమెకు కూడా రాజకీయరంగంలో ప్రవేశించే తలంపువుందా అని కొన్ని బొంబాయి పత్రికలు వ్యాఖ్యానించాయి.

### ఏప్రెల్ మాసాంతంలోనే "వేట"

నెల్లూరీయులు ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి అధిక వ్యయప్రయాసలకోర్చి నిర్మించిన సంయుక్తా మూవీస్ "వేట" చిత్రంలో గగుర్పాటుకలిగించే సంఘటనలు ఎన్నో వున్నాయి. వరోదులను 'ఒసూకా' అనే మారణాయుధంతో హీరో అంతమొందించడం, ప్రేలుళ్ళు మహాద్భుతంగా చిత్రీకరింపబడ్డాయి. ఒక ఎనభై అడుగుల కొండమీదినుంచి వ్రేలాడే ఊడఆధారంగా హీరో నేలమీదికి వచ్చే సీన్‌లో చిరంజీవి తెగించి డూప్ లేకుండా తానే నటించి యూనిట్‌లోని వారందరికీ దిగ్భ్రాంతి కలిగించారు. మరొక సన్నివేశ చిత్రీకరణలో చిరంజీవికి దెబ్బతగిలింది. "ఖైదీ" చిత్రసమయంలో కూడా ఆయన గాయపడ్డారు. ఈ యాదృచ్ఛిక సంఘటనలవల్ల ఈ చిత్రంకూడా "ఖైదీ" లాగే సూపర్‌హిట్ అయితీరుతుందని సంయుక్తా మూవీస్ వారి ప్రగాఢ విశ్వాసం. చిరంజీవితో పాటు జయప్రద, సుమలత, జగ్గయ్య, రంగనాథ్, మోహన్‌శర్మ, నూతన్‌ప్రసాద్, రాజ్‌వర్మ, మున్నగువారు నటించారు. రచన : పరుచూరి బ్రదర్స్, పాటలు : వేటూరి సుందరరామమూర్తి, సీతారామశాస్త్రి, సంగీతం : చక్రవర్తి. కెమెరా : లోక్‌సింగ్, ప్రొడక్షన్: వి. మోహన్, బ్రహ్మానందం, ఫణి, కె. సర్పారెడ్డి, సహనిర్మాత : పి. శ్రీధర్‌రెడ్డి. నిర్వహణ : కె. ధనుంజయరెడ్డి.

### ఎం. ఎస్. కోటా రెడ్డి దర్శకత్వంలో "వైతరణి"

"సంసారంలో సరిగమలు, సీతాపతి సంసారం, కళ్యాణచక్రవర్తి, నామొగుడు బ్రహ్మచారి" వగైరా హాస్యచిత్రాల దర్శకుడుగా ఖ్యాతిచెందిన సుప్రసిద్ధ హాస్యనటుడు తిక్కవరపు రమణారెడ్డి మనుమడు ఎం. ఎస్. కోటా రెడ్డి దర్శకత్వంలో "వైతరణి" చిత్రం తయారవుతూంది. నిర్మాతలు : శేషేంద్రశర్మ వై. వి. రాజు, సమర్పణ : వై. శకుంతలాదేవి.

### హైకోర్టులో సుమన్ అభ్యర్థన తిరస్కృతి

గత మే 21 న ఖైదు చేయబడిన హీరో సుమన్ గూండా చట్టంక్రింద తనను డిటెన్షన్‌లో వుంచడం చెల్లదంటూ హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలుచేసిన విషయం పాఠకులకు విదితమే. కేసు విచారణసందర్భంగా న్యాయవాది అవసరం తనకున్నదని విజ్ఞప్తి చేసినప్పటికీ

—తరువాయి 11వ పేజీలో





'కర్పూరదీపం'లో మురళీమోహన్, సుహాసిని

# నిర్జీవంగా వుంది- జీవనపోరాటం

**సమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

పది సంవత్సరాలక్రితం హిందీనటుడు మనోజ్‌కుమార్ స్వంతంగా కథ వ్రాసి నిర్మించిన "రోటీ, కపడా ఔర్ మకాన్" హిందీచిత్రం ఆధారంగా 'జీవనపోరాటం' చిత్రాన్ని తెలుగులో సమర్పించారు శ్రీ టి సుబ్బరామిరెడ్డి. కూడు, గుడ్డ, గూడు అనేవి సామాన్యజనంలో ఈనాటికీ తీరనిసమస్యలుగా నిలిచివున్నాయి. అందువల్ల యీ కథావస్తువుకు ఎప్పుడూ గుర్తింపువుంది. పంచవత్సరాల నాడే హిందీవాళ్ళు దీన్ని గుర్తిస్తే వారిని కాపీ కొట్టేందుకు యీనాటికి తీరికైంది మన తెలుగువారికి. సార్వకాలికమైన యీ సమస్యను ఎన్నుకోవడం సంతృప్తిగానే వున్నా, హిందీలో మంచి పేరు తెచ్చుకున్న ఈ యితివృత్తాన్ని తెలుగులో చెడగొట్టి భంగాలం చెయ్యడమే బాధాకరం. టి. సుబ్బరామిరెడ్డి వంటి కళాభిమాని సమర్పించగల స్థాయిలో లేదీచిత్రం.

స్వాతంత్ర్య పోరాటంలో సర్వమూ పోగొట్టుకున్న భద్రయ్య (గుమ్మడి) కు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె, భార్య మిగిలారు. భరత్ (శోభన్‌బాబు) ఎం. ఎ. పాసైన నిరుద్యోగి. తమ్ముడు రవి (రజనీకాంత్) శిల్ప- కట్టలే.. కాలేజ విద్యార్థి. ఇంకో తమ్ముడు (నరేష్), చెల్లెలు విద్యార్థిదశలో వున్నవారు. ఏదో విధంగా డబ్బుసంపాదించాలని మోసాలకు దౌర్జన్యాలకు దిగాలనుకున్న రవి, భరత్ చేసిన హితబోధతో మారిపోయి మిలటరీలోచేరి దేశరక్షణకు పూనుకుంటాడు. కాని ఆర్థికవత్తిడులకులోనై భరత్ చీకటిబజారు వ్యాపారస్తులతో చేతులు కలిపి లక్షలార్జిస్తాడు. దేశసరిహద్దు రక్షణలో ఒకచెయ్యిపోగొట్టుకుని ఇంటికి వచ్చిన రవి ఈ పర్యాయం తనవంతుగా భరత్‌కు కనువిప్పుకలిగిస్తాడు. అందరూ కలసి చీకటివ్యాపారస్తులపై యుద్ధం ప్రకటించి సమాజానికి ఆదర్శంగా నిలుస్తారు.

ఇందులో ప్రేమకథ వుండకపోతే బాగుండదు కాబట్టి ఒక (విజయశాంతి) అనే అమ్మాయి భరత్‌ను ప్రేమిస్తుంది. ఆమెకు విలాసజీవితంపై ఆశ కలుగుతుంది. మోహన్ (శరత్‌బాబు) అనే శ్రీమంతుణ్ణి వివాహమాడవలసివస్తుంది. పోలీసుకాల్పుల్లో చనిపోతుంది.

—తరువాయి 11వ పేజీలో

# జిల్లావార్తలు

(1వ పేజీకొరవ)

### వెంకటగిరి కాలేజి. దేశం నాయకుల ఫిర్యాదు

వెంకటగిరి, విశ్వోదయకాలేజి ప్రిన్సిపల్ లెక్చరర్లను సిబ్బందిని నరకయాతన పెడుతున్నారని. దూషిస్తున్నారని, కాలేజికి త్రాగివస్తునారని, ఇంక్రిమెంట్లు వంటివాటి మంజూరులో అవినీతికి పాల్పడుతున్నారని.... ఇంకాదాలాదాలా ఆరోపణలతో, తాలూకా తెలుగుదేశం నాయకుడు శ్రీ సత్యనారాయణశెట్టి, రాష్ట్ర హైయ్యర్ ఎడ్యుకేషన్ డైరెక్టర్‌కు ఫిర్యాదుచేశాడు. మండల తెలుగుదేశం సమావేశంలోకూడా ప్రిన్సిపల్‌పై ఒక నిరసన తీర్మానం చేశారట.

కాలేజి వ్యవహారాలలో రాజకీయ నాయకుల ప్రమేయం ఎందుకండీ? తమ సమస్యలు తమంతటతాముగా పరిష్కరించుకోలేని అసమర్థులా లెక్చరర్లు? వారికిమాత్రం యూనియన్లులేవా?

### ముత్తుకూరుకు మరోబస్సు

ఎమెల్యే శ్రీ రామకృష్ణారెడ్డి ముత్తుకూరు రూట్‌కు మరొక ఆర్. టి. సి. బస్సువేయించారు; ప్రయాణీకులు థ్యాంక్స్ చెప్తున్నారు.

కొత్త ఆర్. టి. సి. బస్‌లు ఒక్క ముత్తుకూరు రూట్‌లోనేనా వేయాల్సింది. జిల్లాలో ఇంకెక్కడా అవసరంలేదా?

### 1200 ఇళ్లు

ఎమ్మెల్యే శ్రీ ఆ. రామకృష్ణారెడ్డిచే మరొక న్యూస్- సర్వేపల్లి నియోజకవర్గంలోని కనుమూరు, పంటపాళెం నారికేళపల్లి, ముత్తుకూరు, కృష్ణాపట్నం, పేనిన్ పట్టుపాళెం, వల్లూరు, వాళ్ళ పూడి, బ్రహ్మదేవం గ్రామాలలో 1200 మంది హరిజన, గిరిజనులకు పక్కాఇళ్ళు మంజూరు చేశారు. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్, ఆర్ డి ఒ. డాక్టర్ నాగేశ్వరరావు, రామకృష్ణారెడ్డి, గూడూరు ఎమ్మెల్యే శ్రీ బల్లి దుర్గాప్రసాదరావు తదితరులు ఆమధ్య ఒకరోజు ఈ గ్రామాలన్నీ పర్యటించారు: అడిగినవారికి అడిగినన్ని ఇళ్ళు, కలెక్టరుగారు అక్కడికక్కడే మంజూరు చేశారు.

### షార్‌లో ఉగాది

షార్ రిక్రియేషన్ క్లబ్ 10 తేది ఉగాదిరోజు కవి సమ్మేళనం నిర్వహించింది. కవులు- జయంపు కృష్ణ. నెలి శివరామశర్మ. పచ్చిపులుసు వెంకటేశ్వర్లు పాయసం సుబ్రహ్మణ్యం, ఎన్. ముని సుందరం తదితరులు కవితాగానం చేశారు. శ్రీ బి. టి. ఎ. రామాచార్యులు అధ్యక్షతవహించారు. శ్రీ సి. వి. ఎస్. మహేశ్వర్ వ్యాఖ్యాతగా వ్యవహరించి, చతురోక్తులతో సభను రక్తికట్టించారు.

క్లబ్ ఆధ్వర్యంలో నడిచే లైబ్రరీ కార్యదర్శి శ్రీ జి. టి. రామారావు కవులను పరిచయంచేశారు. శ్రీ మారెళ్ల స్వాగతం చెప్పారు. శ్రీ రామలింగేశ్వరరావు సభ చివర మిమిక్రీచేశారు. తొలుత కుమారి రాజ్యలక్ష్మి, భువనేశ్వరి ప్రార్థనగీతం

### ఆత్మకూరు స్టే తొలగింది

ఆత్మకూరు టౌన్‌లో దురాక్రమణల తొలగింపుపై హైకోర్టు ఇచ్చివుండిన స్టే తొలగించినట్లు తెలుస్తూంది. ఏళ్ల తరబడి ఆక్రమణలు జరిగిన దౌర్జన్యం, పంచాయితీ అధికారులు రోడ్లో అడ్డంగావున్న బంకులు, అంగళ్ళు తొలగించడానికి యత్నించినప్పుడు ఈ స్టే యిచ్చారు. ఇప్పుడైనా అధికారులు తొందరపడి, ఆక్రమణలు తొలగిస్తే బస్టాండు, ప్రభుత్వాస్పత్రికి వెళ్లేవాహనాలకు ఎంతో మేలుజరుగుతుంది. ఐతే పంచాయితీ అధికారులుమాత్రం ఎందువల్లనో దీనిజోలికి పోకుండా నానవేస్తున్నట్లున్నారు; కలెక్టరైనా చొరవతీసుకోవాలి.

### గూడూరు వార్తలు

(5వ పేజీ కొరవ)

శ్రీరాంబ రాజన్ రాజయోగంలో తన అనుభవాలు వివరించారు, విశ్వ హిందూ పరిషత్ సభ్యుడు డాక్టర్ ప్రభాకరరెడ్డి స్వాగతించారు!

మతమౌఢ్యం, పైశాచికప్రవృత్తి, వర్గ విచక్షణ వంటి దుర్లక్షణాల ఫలితంగా చిత్తశాంతి కోల్పోయినవారికి రాజయోగం మంచి మందు అన్నారు- పుష్పాంజలి.



మా అమ్మ

## అలంశెట్టి రామమ్మ

తేదీ 9-4-1986 బుధవారం
రాత్రి 9-10 గంటలకు స్వర్గస్తులైనారు.
ఆమె ఆత్మకు భగవంతుడు శాంతి ప్రసాదించాలని కోరుకుంటున్నాము.

ఆమె ఉత్తరక్రియలు
19-4-86 తేది
ఉదయం 8 గంటలకు
కాపువీధిలోని, మా
స్వగృహమున జరుగును.

-అలంశెట్టి పుల్లయ్య
నెల్లూరు.

## జిల్లాపరిషత్

(2వ పేజీ కొరవ)

ఎమ్మెల్యేలు, న మి తి అధ్యక్షులకు, తెలుగుదేశంలోని ప్రతి ప్రముఖులూ సిఫార్సు చీటీలతో జి. ప. ఆఫీసును ముట్టడిస్తున్నారు. ఆ నందాని నుంచి ఏ రాజకీయ మెళుకువలు నేర్చుకోలేక పోయినా, పనిబడి వచ్చినవారిని త్రిప్పి త్రిప్పి చంపే కళను, బాలచెన్నయ్య శీర్షంచేసుకుని వుంచేవాడు; రేపు, మాపు వాయిదాలతోనే సంవత్సరాలు నెట్టేయడంలో ఆ ఖ ం డు దస్సించుకున్నాడు; శ్రీనివాసులురెడ్డిలో విశేషం- ఈ బలహీనతకు లోనుకాకుండా నిగ్రహించుకో వడం; కొద్దికాలంలోనే ప ను లు నాన వేయకుండా, సత్వరం పరిష్కరిస్తున్నా తన్న మంచిపేరు తెచ్చుకున్నాడాయన.

రెవిన్యూమంత్రి బేషరతుగా సమర్థిస్తు న్నందువల్ల సమకుంటాము- శ్రీనివాసులు రెడ్డికి కలెక్టరాది అ ధి కా ర్ల సహకారం బాగానే లభిస్తూంది. కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ ఆ న లే సాత్వికుడు: జి. ప. చేర్మెన్‌తో విభేధించి లేదా సహాయ నిరాకరణచేసేతత్వం కాదాయనది. సుజాతారావు వుంటే ఏమిచేసేవాడోకాని, శ్రీనివాసులురెడ్డికి ఇప్పటి క లె క్ట రు తో 'చిరాకు'లేవీ వున్నట్టులేదు. అంతవరకు అతనదృష్టవంతుడు.

పార్టీలోనే ఆయన కొంత ఇ ర కా టవడుతున్నట్టున్నాడు నిజానికి మంత్రిగారికి కుడికన్నుగానో, కుడిభుజంగానో మెలగుతున్నా, ఆ మంత్రివర్గంలోనే కొందరికి శ్రీనివాసులురెడ్డి అంటే 'కన్నెర్ర' అన్న విషయం జగద్విదితమే! గూడూరు డివిజన్‌లో ఈయన రాజకీయంగా పెరగడం నిజానికి మంత్రి సహోదరులకే కంటగింపుగావున్న విషయమూ బహిరంగ రహస్యమే. ఒకటి రెండు అంతరంగిక సమావేశాలలో, ఎద్దుల వేణుగోపాలరెడ్డి వం టి వా రి చే త 'నిమ్మకాయకోడి'ని తూష్కారంగామాట్లాడించింది ఎవ్వరో ఈ విషయం. వై. ఎస్. ఆర్. కు తెలియకపోలేదు.

గూడూరు డివిజన్ రాజకీయాలలో వారి సంబంధాలు పా లు నీ ళ్ళ వ లె వున్నాయో, ఉప్పు నిప్పుగా మ ం దు తున్నాయో మాకు తెలియదుగాని, జి.ప. విషయంలోమాత్రం శ్రీనివాసులురెడ్డి ఎవరిమాటా కాదంటున్నట్లు కన్పించడం లేదు. ఎ మ్మె ల్యే ల విషయంలో మరీ జాగ్రత్తగావున్నాడు. వారు అడిగినవన్నీ చేయడమేకాదు-వారి నియోజకవర్గాలో ఏదైనా చేయవలసివస్తే, వారికిచెప్పి, అనుమతి తీ సు కో ని దే చేయడంలేదు. అందువల్లే ఒక్క ఎమ్మెల్యేకూడా కుయ్ కయ్ మనడంలేదు. ఆనంవారిని పరోక్షంగా ఆమడదూరంలో పెడుతున్నాడు. మంత్రిగారి ప్రీత్యర్థం అదైనా చేయాలి గదా!

ఓరేపల్లి తప్పుకున్నరోజే కాంగ్రెసు వాదులకు జి ప పై ఆశలు పోయాయి; సంబంధాలు తెగాయి. బాలచెన్నయ్య పని చెయ్యలేకపోయినా, కాంగ్రెసు వాదులను పలకరిస్తూ, ద గ్గ ర గా వున్నట్లు నటించేవాడు: ఎల్లసిరివారు ఆ మొగమాటాలకుకూడా పోతున్నట్టులేదు. పై పెచ్చు గూడూరు డివిజన్ కాంగ్రెసు నాయకుల ప్రాపులోవుండే సిబ్బందితో ఫుట్‌బాల్ ఆట ఆడుతున్నారట.

మొత్తమ్మీద ఈనాటివరకు ఎల్లసిరి, శ్రీ పోను సత్తెయ్యలకు ఇందుకరి టొర్నీలు ఆంటూ పోతున్నారు. ఈ నెలో, వైనెల లోనో తీవర్ల బదిలీలకు అవకాశం కల్గుతుంది. అప్పటివరకు జి. ప. బు రద్దు కాకుండా నిల్చివుంటే, అప్పుడు బయట పడుతుంది. శ్రీనివాసులురెడ్డి వ్యక్తిత్వమేమిటో, సమర్థత ఎంతో! ★

---

శ్రీ కామాక్షితాయి దేవ్యైనమః

### శ్రీ మల్లిఖార్జునస్వామి కామాక్షితాయి దేవస్థానం

జన్నవాడ - నెల్లూరుజిల్లా

## టెండరు నోటీసు

నెల్లూరుజిల్లా, బుచ్చిరెడ్డిపాళెం మండలము, జన్నవాడక్షేత్రమున వేం చేసియున్న శ్రీ మల్లికార్జునస్వామికామాక్షితాయి దేవస్థానమున 28-5-86 తేదినుండి 7-6 86 తేది వరకు జరుగనున్న బ్రహ్మోత్సవములో ఈక్రింద ఉదహరించిన పనులను చేయుటకు టెండర్లు పిలువడమైనది.

1. (ఎ) చలువ పందిళ్ళు.
   (బి) షామియానా పందిరి.
2. తెప్ప కట్టుట
3. గ్యాసులైట్లు సప్లయిచేయుట.
4. విద్యుద్దీపాలంకరణ.
5. డ్రామా స్టేజివద్ద జనరేటరు, మైక్ సెట్ ఏర్పాటు.
6. బాణాస.చ.
7. వెల్ల వేయుట (సున్నముకొట్టుట)
8. డ్రామా స్టేజి కట్టుట.

ప్రతి టెండరుదారు రు. 500/- లు ధరావతు చెల్లించి దేవస్థానము రసీదుతోపాటు వారి వారి టెండర్లు ఒక్కొక్క పనిని ఏర్పాటు నిమిత్తము ఏప్రెల్ నెల 30 తేది సాయంకాలం 4 గంటల లోపల దేవస్థాన కార్య నిర్వహణాధికారి వారికి దాఖలుచేయవలెను. టెండర్లు అదేరోజు సా. 6 గం టెండరుదార్లు లేక వారి ఏజంట్ల సమక్షమున తెరువబడి, తక్కువ టెండరు దార పేరు ప్రకటించబడును.

టెండరు ఆ యా పనుల వివరములకు దేవస్థాన కార్యాలయం పని చేయు వేళలలో సంప్రదించి పొందవలెను.

జన్నవాడ క్షేత్రము — ము. సుబ్బరామయ్య.

10-4-1986 — కార్యనిర్వహణాధికారి.

---

## ఊరు-పేరు

(4వ పేజీ కొరవ)

రోటును త్రివేణి సంగమం అని పిలుస్తారు. ఇటువంటి సంగమ ప్ర దే శా లు హిందువులందరకు పుణ్యప్రదేశాలు. ఇక్కడ స్నానమాచరిస్తే,సర్వపాపహరణమని నమ్మకం.

ప్రయాగపేరును అ ల హా బా దు గా మార్చారు ఔరంగజేబు. కాశీ విశ్వనాధునికి స్థానభ్రంశంచేసి నూతిలోవేసి, హిందువుల హృదయాలను బాధపెట్టినా, ప్రకృతి ప్రసాదించిన త్రివేణిసంగమాన్ని మాత్రం మార్చలేకపోయాడు పాపం.

మనజిల్లాలోను, సంగం అనే గ్రామం వుంది. ఇది నె ల్లూ రు కు 22 మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ 'బీ రా పే రు' అనేనది పె న్నా న ది లో కలుస్తుంది, కొంచెం పై భా గ ం లో బొ గ్గే రు (భృగు+ఏరు= భృ గు మ హ ర్షి పేర వెలసిన ఏరు) కూడా పె న్నా న ది లో కలసి త్రివేణి సంగమంతో పోల్చదగిన ప్రాంతమైంది. ఇక్కడ వెలసిన ఈశ్వరుని పేరు సంగమేశ్వరుడు.

కటకపురాన్ని రాజధానిగా చేసుకొని పాలించిన కపిలేంద్ర గజపతి (క్రీ. శ. 1434-1468) 1468 ప్రాంతంలో ఉదయగిరి రా జ్యా న్ని జయించాడు. కాని విజయనగర రాజవంశముల, రెండవ రాజవంశమునకు చెం ది న, సాళ్వనర సింహరాయలు (1486-91) మ ర ల ఉదయగిరిని కైవశం చేసుకొన్నాడు.

కపిలేంద్రగజపతి కుమారుడు పురుషోత్తమగజపతి (1468-97)1489లో సాళ్వనరసింహరాయల నోడించి, తిరిగి ఉదయగిరిని స్వాధీనం చేసుకున్నాడు.

శా. శ. 1423 నకు సరిపోవు క్రీస్తు సంవత్సరం 1501 దుర్మతి వైశాఖశుద్ధ పౌర్ణమి సోమవారం చంద్రగ్రహణ పుణ్య కాలమున పురుషోత్తమగజపతి తనయుడు ప్రతాపరుద్రగజపతి తన ది గ్వి జ య యాత్రలో సంగమక్షేత్రంలోని శ్రీ సంగమేశ్వరుని స న్ని ధి లో రాజవోలు (రాజ + వోలు = రాజవోలు రాజపురము)గ్రామాన్ని నారాయణాభిదానుండగు, సన్నంశెట్టునకు సహిరణ్యోదముగా దానమీయబడినట్లు రాజవోలు శాసనం చెప్పుచున్నది.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

కోట స్కూలు ప్రిన్సిపల్ శ్రీ ఆర్. జి. రాథోర్, ఇండియన్‌బ్యాంక్ మేనేజరు శ్రీ ఎస్. ఎస్. ఎస్. శర్మ, ఎలక్ట్రిసిటీ ఎస్ ఇ. శ్రీ ఐ. జె. కె. రెడ్డి తదితరులు మాట్లాడారు. కరస్పాండెంట్ శ్రీ కె. ఎస్. రావు స్వాగతించారు. పిల్లల సాంస్కృతిక కార్యక్రమాలు కన్నులపండువుగా వుండినాయి.

## జీవనపోరాటం

(9 వ పేజి కొరవ)

ఇందులో మరో పట్టి ధనాతా వుంది. [illegible] తులసి (నాదిర) అమెకంద్రి (నాజాయణ) కుటుంబానికి సంబంధించింది.

బియ్యంవ్యాపారి, టైలర్, ఇంటి స్వంత దారు కలిసి తులసిని బలవంతంగా అనుభవిస్తారు. భర్తశేఖర్ ఆమె బిడ్డతల్లి అవుతుంది. భరత్ ఆమెను తేరదీసి వివాహ మాడుతాడు.

ఇదీకథ. దర్శకుడు రాజాచంద్ర కథ నడిపిన విధానం తప్పుగావుంది. సమకాలీనసన్నివేశాలనుచొప్పించి తెలుగువాతావరణానికి అనువుగా మలుచుకునే ప్రయత్నంలో మూలకథను చావుదెబ్బకొట్టాడు. ద ర్శ కు డు. చి త్ర ం లో ఎక్కడా కూడు, గుడ్డ, గూడుకు సంబంధించిన అంశాలు ప్రాధాన్యత పొందలేదు. నిరుద్యోగులుగా వున్నవారుకూడ మ ం చి గుడ్డలు రోజుకొకటి వేసుకుంటూ ప్రియురాళ్ళతో పార్కుల్లో ఆటపాటల్లో తేలిపోతుంటారు. ఒక్క తులసి పా త్ర లో కూటికోసం కొంతతపన చూపాడు, తిండి గింజలకోసం అంగటి శెట్టివద్దకుపోయిన తులసిని అతను, టైలరు, ఇంటి స్వంత దారు బలాత్కారంగా అనుభవిస్తారు. ఈ సన్నివేశం చాలా నీరసంగా తయారైంది. ఇదేకాదు ఏ సన్నివేశంలోనూ పటుత్వం లేదు. తలాతోకా లేకుండా అ తు కు ల బొంతలా తయారైంది చిత్రం.

రజనీకాంత్, శోభన్‌బాబు, శరత్‌బాబు వేలు, వీరభద్రరావు, సత్యనారాయణ, రావు గోపాలరావు, న రే ష్, గుమ్మడి, పి. యల్. నారాయణ, విజయశాంతి, రాధిక లాంటి మంచినటులలోని నటనా శక్తిని దర్శకుడు బూడిదపాలు చేశాడు, మూకుమ్మడిహత్య అంటారే అదేనేమోయిది.

చిత్రం బోరుగాతయారవడానికి గణేశ్ పాత్రో మా ట లు కూ డా తమవంతుగా తోడ్పడ్డాయి. "మరిచిపోనేస్తం"- అనే పాట బాగుంది. ఎడిటింగ్ సరిగాలేదు. చక్రవర్తి సంగీతం, ముఖ్యంగా నేపథ్య సంగీతం చెవులు దిమ్మెక్కిస్తుంది. ★

## సినిమా వార్తలు

(9 వ పేజి కొరవ)

విచారణను వాయిదావేయడంలో అత్యయిక బోర్డు విఫలమవడంతో డిటెన్షన్ ఉత్తరువు రద్దుకాదా? ఒక పోలీసు అధికారి నమక్షంలో డి టె న్యూ చే సి న నిష్కృతి ప్రకటన ఆధారంగా అవ్యక్తిని గూండా చట్టంకింద డిటెన్ చేయవచ్చా? ఈ రెండు అంశాలను సుమన్ తన అభ్యర్థనలో పే ర్కొ న్నా రు. దీనిని తోసిపుచ్చుతూ న్యాయసహాయం కోరుతూ సుమన్ చేసినవిన్నపాన్ని కోర్టు తిరస్కరించింది హైకోర్టు డివిజన్‌బెంచ్ తదుపరి ఉత్తర్వులు జారీచేయడానికి వీలుగా ఆ బెంచ్ ముందు ఇందుకు సంబంధించిన పత్రాలను వుంచాలని ఫుల్‌బెంచ్ ఆదేశించింది.

### సి. ఎస్. రావ్ దర్శకత్వంలో "కచదేవయాని"

క చు డు గా చక్రపాణి, దేవయానిగా విజయరంజని, శుక్రాచార్యుడుగా సత్యనారాయణ నటించే చంద్రోదయ ఆర్ట్ ఫిలిమ్స్ "కచదేవయాని" చి త్రా న్ని తొమ్మిది జాతీయ, అంతర్జాతీయ బహుమతు ల ం దు కు న్న "ఒకఊరి కథ" చిత్రనిర్మాత ఎ. పరంధామరెడ్డి, జగ్గుబాబుతో కలిసి నిర్మిస్తున్నారు. రచన: కొండవీటి వెంకటకవి, సంగీతం: కె. వి. మహాదేవన్, సమర్పణ: ఎస్. గోవిందరావు. ★

---



---

నెల్లూరు ప్రి. డి, ము. కోర్టులో

E. P. No. 232 of 78

O. S. No. 132 of 78

సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, నెల్లూరు -D. H. R.

కుప్పచ్చి సుబ్రమణ్యం వగైరాలు -J. D.rs.

పై నంబరున దావా డిక్రీబాకిని రాబట్టుకొనుటకుగానుక్రిందవివరించినషెడ్యూలు దాఖలా 1వ ప్రతివాది హక్కు అనుభవంలోగల స్థిరాస్తిని పై కోర్టువారు 30-4-86 తేది ఉదయం 10 గంటల నుండి బహిరంగముగా వేలం వేయుదురు. పాడదలచినవారు కోర్టులోహాజరై పాటలో పాల్గొనవచ్చును.

షెడ్యూలు

నెల్లూరు డిస్ట్రిక్టు రిజిస్ట్రేషను ఇందుకూరుపేట సబ్ రిజిస్ట్రారులో చేరిన వెంకన్నపాళెం గ్రామ పొలంలో 1వ ప్రతివాది/JDr. చెందిన భూముల వివరం,

సర్వేనెం. 284/ఎ,మెట్ట యి.5-00 2.023 హెక్టారులు.

డిక్రీదారు విలువ రు. 2500/-

అమీనా విలువ రు. 15000/-

—నర్వేపల్లి మల్లికార్జునశర్మ

డిక్రీహోల్డరు అడ్వకేటు.

---

కావలి ప్రి. డి, ము. కోర్టులో

O. S. No. 582 of 85

ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు, బిట్రగుంట Rep. by బ్రాంచి మేనేజరు —వాది

వాకాటి తిరుపాలు వగయిరా

To.

1. వాకాటి తిరుపాలు S/o. గోవిందయ్య సాకిన కమ్మవారిపాళెం, బ్రాహ్మక్రాక మజరా, కావలి తాలూకా -ప్రతివాది

ఈ నెంబరున వాది మీమీద దావా వేసినందుకు మీకు నోటీసు నిమిత్తం 5-6-86తేదికి వాయిదా అయివున్నది. అందుకుగల ఆక్షేపణలు ఆరోజు ఉదయం 10-30 గంటలకు హాజరయి నీ ఆక్షేపణలు తెలుపుకోవలెను లేనియెడల నీ మీద ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

-వి. వి. నరసింహాచార్యులు

వార తరపు అడ్వకేటు.

---

# నెల్లూరు కృష్ణ ఏ.సి. లో

## విజయవంతమైన 50వ రోజు

క్రిష్ణయ్య: శాంతి! నువ్వు మనసు చంపుకుని వెళుతున్నావు కదూ

శాంతి : లేదు! అందమైన పొంన్నులాంటి నీ ఇంట్లో చురుక్కున మండే కట్టెలాంటి నీ ఇల్లాలు వచ్చింది. మీ కాపురమనే చక్కటి వంట కుదిరింది. ఎసరు మరిగిన ఆవిరిలా నే వెళ్ళి-పోతున్నాను. ఇదే నే వేసిన పొడుపు కథకు అర్థం. రాధ కను విప్పే కథను విప్పింది కథను విప్పిన క్షణం నేనుండ నన్నానుగా అందుకే వెళ్ళిపోతున్నాను.

రాధ: శాంతి! మనసారా చెబుతున్నాను, బావన్నది నిజం. అతని పక్కన వుండటాని కయినా,.. అతని ఇంటికి ఇల్లాలు కావడానికైనా, నీకే అర్హత వుంది. మీ లాంటి మంచివాళ్ళ ఆనందాన్ని చూసి తృప్తిపడే మనసు వుండడం నా అదృష్టం. నీ విక్కడే వుండిపో.



భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# ముద్దుల క్రిష్ణయ్య

S.గోపాల్ రెడ్డి B.Sc (Ag) — కోడి రామకృష్ణ

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి. జమీన్ రైతు ప్రెస్. 17/170. ... వీధి. నెల్లూరు-524001